# తెలుగు సామెతలు

ఆర్యోక్తి సప్తశతి — నాలుగు శతకములు






శిరోమణి

నూకల సత్యనారాయణ శాస్త్రి

శ్రీ శారదాంబాయై నమః

# ఆర్యోక్తి సప్తశతి

( తెలుఁగుసామెతలు )




రచయిత:

శిరోమణి, నూకల సత్యనారాయణ శాస్త్రి,

ఆంధ్రోపాధ్యాయులు, మదరసే అలియా హైస్కూలు.

మలకపేట, హైదరాబాదు (ఆంధ్రప్రదేశ్.)




[ వెల 1–25 న. పై.

రచయిత



శిరోమణి

వాకిటి సత్యనారాయణశాస్త్రి

# కృతిసమర్పణము



శ్లో॥ శ్రీ నూకల కులోద్భూత సత్యనారాయణేన సత్ ।
దత్తం శ్రీ లలితాదేవ్యై ఆర్యోక్తీనాం చతుశ్శతమ్ ॥

కం. ఎనిమిది కోశ సుమమ్ముల
మనముననే నొసఁగఁ దలఁతు మంగళధాత్రీ !
కొనుమీ శతక చతుష్టయ
మును "చంద్రున కొక్క నూలుపో" గగు మాడ్కిన్.

ముద్రణ వ్యయప్రదాతలు

శ్రీరామా బుక్ డిపో యజమానులు, శికింద్రాబాదు.

కం. శంకరసతి ! కొను "పబ్బా
శంకరు" లోక శతకమునకు సర్వవ్యయమున్
సంకల్పిత గతినొసఁగెను
గొంకకయే రెండువేల కోశమ్ములకున్.

గ్రంథకర్త.

# గ్రంథకర్తృ పరిచయ వాక్యములు.

యన్. యన్. శాస్త్రి M. A, L. L. B, B. T.
సూపరెంటెండెంటు బేసిక్ ట్రైనింగుస్కూలు నల్లగొండ.

టి. వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి
అధ్యాపకులు ఉపాధ్యాయ ప్రాతిపదిక శిక్షణాలయము, నల్లగొండ.

"తెలుఁగు సామెతలు" అను శీర్షికతో ప్రస్తుతము వెలువడిన ఈ గ్రంథమును రచించినది శ్రీ నూకల సత్యనారాయణ శాస్త్రిగారు. వీరి జనకులు కీ. శే. శ్రీ నూకల వేంకటసోమయాజులు గారు. వీరిజనయిత్రి కీ.శే. శ్రీమతి సుభద్రమ్మ గారు, వీరి జన్మస్థలం తూర్పుగోదావరిజిల్లా, రాజోలుతాలుకా, ఆదుర్రు గ్రామము. స్వస్తి శ్రీ శుభకృతునామ సంవత్సర చైత్రశుద్ధ పంచమికిసరియగు ది 12-4-1902న వీరిజననం. వీరికి ప్రథమ, ద్వితీయ కళత్రములద్వారా సంతాన భాగ్యము 5 గురు కుమారులు, 6 గురు కుమార్తెలు. నలుగురు B. A. ప్యాసయి A. G. ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నారు.

శ్రీ శాస్త్రిగారు మాధ్యమిక దశవరకు సాంప్రదాయ సిద్ధమైన పాఠశాలలో విద్య నభ్యసించిన పిమ్మట ఆర్ష విద్యాభ్యసన కుతూహలురై కీ. శే. బ్రహ్మశ్రీ ఉపాధ్యాయుల గణపత్యవధానులగారి చరణ సన్నిధిని వేదశ్రౌతములును, కీ. శే. బ్రహ్మ శ్రీ మరువాడ కాశీపతి సోమ యాజు లు గారి వద్ద సాహిత్యమును, అభ్యసించిరి. బ్రహ్మ శ్రీ కర్రిఅగ్నిహోత్ర శాస్త్రి గారి శుశ్రూషనల్పి నాటకములు, పూర్వమీమాంసను అభ్యసించుటయేగాక, శ్రీవారితో నారాయణపేటలోని సర్వతోముఖమునకువెళ్ల భాగ్యమును పొందిరి. యాగానంతరము కొందరు మహారాష్ట్ర మిత్రుల సహాయమున 1938 లో వివేకవర్ధనీ ఉన్నతపాఠశాలలో ఆంధ్రోపాధ్యాయ పదవిని స్వీకరించి, తదుపరి హిందీ, తెలుగు భాషలలో శిరోమణి పట్టభద్రులైరి. 18 సం॥ ఆపాఠశాలలోనే సేవచేసిరి.

ఇంతేగాక శ్రీ శాస్త్రిగారికి వేదశాస్త్రములు, వైద్యము, జ్యోతిషము, మంత్రశాస్త్రము, కవిత్వము మహారాష్ట్రభాషలలో ప్రవేశముగలదు. శ్రీకర్రిఅగ్నిహోత్రశాస్త్రిగారివద్ద సూత్రభాష్యమునునేర్చి మంత్రశాస్త్ర రహస్యములతో లలితామంత్రదీక్షను పొందిరి. వీరు శ్రీ లలితాదేవీ భక్తులు.

24-4-1957 నుండి వివేకవర్ధనీ ఉన్నత పాఠశాలలోని ఉపాధ్యాయ వృత్తి నుండి విరమించి, మరల మదరసే అయిజ్జా ఉన్నతపాఠశాలలోని ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేయుచున్నారు. విరామ సమయములందు వారికభిరుచి గల్గిన వివిధ శాస్త్రములలోను నిరంతర కృషిసల్పుచు ఉత్తమ గ్రంథములను వెలువరించుచున్నారు. వీరిశైలి మధురమై పండితులకును, పామరులకును, హృదయరంజకముగా నుండును. వీరిచే రచింపబడిన ఆర్యోక్తిసప్తశతి మొదలుగాగల గ్రంథములలోని పద్యములు ఇంతకుముందే గోలకొండ పత్రిక, బాల, ఆంధ్రపత్రిక మొదలగు పత్రికల ప్రశంసల నందుకొన్నవి. పదజాలము సరళమయి వినసొంపుగా నుండును. వీరి రచనలు (1) ఆర్యోక్తి సప్తశతిలోని నాలుగు శతకములు, (2) హ్రీంకారశతకము. (3) శ్రీకృష్ణాష్టోత్తర శతనామపూజ. (4) శ్రీలలితోపాఖ్యానమును ఆంధ్రీకరించు చున్నారు. దీనిలో 42 సర్గలుకలవు. దేవీమహిమ, భండాసురవధ, మహాయాగ క్రమము, శ్రీచక్ర రహస్యము, రసవంతములగు కథానికలతో గూడినది. ఇది నాలుగు మాసములలో పాఠకులకు అందజేయు తలంపుతో దినరాత్రములు పరిశ్రమ మొనరించుచున్నారు.

వీరువ్రాసిన హ్రీంకార శతకము లలితోపాసకులకు మిగుల నుపయోగమైనది, అది లలితాత్రిశతిలోని నామములలోగల హ్రీంకార నామములనుగ్రహించి యర్థము మొదటి రెండు పాదములలో వివరించి మిగిలిన రెండు పాదములలోను ఆ నామమును యథాయథముగా నిమిడ్చిరి. ఇది వారిప్రతిభకు నిదర్శనము.

వయోవృద్ధులైనను గ్రంథరచనలో నైతేనేమి, విజ్ఞాన ప్రస్తారములో నైతేనేమి యువకులకు లేని చైతన్యోత్సాహముల ప్రదర్శించుదురు. వీరుచేయు కృషి భగవంతుని ఆశీస్సులు పొందగలదనియు, దేశకల్యాణమునకు తోడ్పడగలదనియును ఆశించవచ్చును. ప్రస్తుతము హైదరాబాదులో స్థిరవసతి గృహనిర్మాణ కుతూహలురైయున్న శ్రీశాస్త్రిగారికి ఈగ్రంథప్రచురణముకూడ కొంతవరకు అర్థికసహాయ సంపత్తిని చేకూర్చగలదని మా నమ్మకము.

---

ఓం.

# పీఠిక

శ్రీమదాంధ్రభాషా జనయిత్రీ సమర్చనార్థ మొక చిన్న కావ్యహారమును రచించి సారస్వతసేవ యొనర్పవలయునను మనోరథము నాకు చిరకాలము నుండియు కలదు. అది నేటికి సిద్ధించినది.

ఏదేని దేవీమహిమనుగాని, భక్తుల చరిత్రగాని, గీర్వాణభాషయందలి సుభాషితములనుగాని ఆంధ్రీకరింపనెంచి యేతత్కార్యము నే మహాత్ములైనను ఒనరించి యుండిన నాయత్నము విఫలమగునేమో యని యీ సందేహమును నివృత్తి చేసికొనుటకై బ్రహ్మశ్రీ P. H. D. బిరుదాన్వితులును, ఉస్మానియా విశ్వ విద్యాలయమునం దాంధ్రోపన్యాసకులు నగు శ్రీ దివాకర్ల వెంకటావధాని (M. A. ఆనర్సు) గారిని దర్శించి నా యిచ్ఛ వెలిబుచ్చి నేను నిస్సంశయుడనైతిని

"ఏగ్రంథమైనను పద్యరూపమున వెలయుట శ్రేయోదాయకమనియు, కొన్ని పద్దెములనల్లి చూపు" డనియు శ్రీ యవధానులుగారు నన్ను ప్రోత్సహించిరి. వారి యాదేశానుసారముగా నే నేబది పద్యములనువ్రాసి శ్రీవారికి వినిపింవగా నందలి స్వల్పదోషములను సవరించి ఈ యత్నమును సాగింపవలసినదని నన్ను హెచ్చరించిరి. "గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు చ్ఛిన్న సంశయాః" అన్నట్లు శ్రీవారు నా సందియములను తీర్చి నాకు మార్గదర్శకులైరి.

శ్రీకర "దివాకర" కరస్పర్శయే నా హృదయాంధకారమును బాపి నా ముకుళిత హృదయారవిందమును వికసింపజేసినది. ఇయ్యది యేకలవ్య భక్తి. తండులములలో నేకదేశమగు నా గృహనామము చేతను (నూకల) కవులలో నొక లవలేశమైన నాచేతను "ఏకలవ్యత" యక్షరశః సార్థకమగుచున్నది. "శ్రీదుర్గా సప్తశతీ" ప్రీత్యర్థమై ఏడుశతకములను దుర్గకు సమర్పింపతలంచి దీనికి సప్తశతి యను నామము నిడితిని.

నే నాటవెలఁదుల నెన్నుకొనుటకు రెండుకారణములు. శ్రీ అవధానులు గారు చిన్న పద్యములను ఎన్నుకొమ్మనుట మొదటిది. ఆ పద్యములందే లోకోక్తు లెన్నియో పొందపొసగి యుండుట రెండవది. ఉదా. "అడుసుత్రొక్కి కాలు కడుగనేల ?" "ఎంతచెట్టునకగు నంతగాలి" "ఎట్టిగూటిచిలుక కట్టి పలుకు" "కట్టెవంకతీర్చె గాడిపొయ్యి" మొదలగునవి.

శతక వాఙ్మయమున కొకేవిధమగు మకుటముంచుట కవిసంప్రదాయము. ఆకవి సమయము నుల్లంఘింపజాలక "ఆనుకూల్య సత్య మార్యసూక్తి" యనునది నా శతకమునకు మకుటముగా నిర్ణయించితిని. అనగా దీనిలోని ఆర్యోక్తి లోకానుభవమునకు శాస్త్రానుభవమునకు సరిపడి సత్యమైనసూక్తి అని యర్థము. దీని విశేషార్థమును వివరించుటకు పూర్వము దీని కనుబంధముగానున్న యొక పూర్వ సంఘటన నిట వివరించుట యనుచితము కాదు.

క్రీ. శ. 1925 సం॥ నిజాంరాష్ట్రమునందలి 'నారాయణపేట' నగరమున జరిగిన సర్వతోముఖ యాగమునందు నైజాం శ్రోత్రులకు అందఱకును నేను అనుకూలుడనై యుండి సహాయమును చేసిన హేతువుచే వారు సంతసించి 'నూకల' అను నా గృహనామమునకు మారుగ అనుకూల్య స. నా. శాస్త్రి అని పిలువసాగిరి. దానినాధారముగా చేసికొని "ఆనుకూల్యసత్య" అన్నచోట నాగృహనామమును, నా నామైకదేశమును సూచితము లగుచున్నవి. సత్య, మా, ఆర్య, అను మూడు పదములను మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళీ నామములను వరుసగ సూచించుచున్నవి. సూక్తి యను పదముచే "ఆర్యోక్తి" అను గ్రంథనామము సూచితమగుచున్నది. ఈ రీతిని మకుటకుసుమమును 'షట్పదములు' ఆశ్రయించి యానంద మకరంద బిందువుల నొలికించుచున్నవి.

దీనిలోని ప్రథమశతకమును ముద్రించుటకు గతమున సహాయముచేసినదాతలకును, హ్రీంకార శతకమును అచ్చొత్తించుటకు ధనసహాయముచేసిన దాతలకును, ప్రస్తుత మీ నాల్గుశతకములలోను ఒక శతకమును రెండువేల ప్రతులను సంపూర్ణముగా నచ్చొత్తించి యొసంగిన శ్రీరామా బుక్‌డిపో యజమానులు శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారికిని నా హృదయపూర్వకాభి వందనములు.

ఈగ్రంథమునకుసదభిప్రాయముల నొసంగినపూజ్యులకును, అన్యవిధముగా నాకుసహాయ మొనరించిన నామిత్రులకును నా నమోవాకములు. బాల, ఆంధ్రపత్రిక, గోలకొండపత్రిక, జ్ఞానతరంగిణి, రేడియో మొ॥ వారి అభిప్రాయములను స్థలాభావముచే ముద్రింపజాలనందులకు చింతించుచు వారికి నా కృతజ్ఞతను తెలుపుచున్నాను.

గ్రంథకర్త.

# అష్టదిగ్గజముల
# అమూల్యాభిప్రాయములు

శ్రీఖండవల్లి లక్ష్మీరంజనముగారు, M. A.
ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు డిపార్టుమెంట్ హెడ్.

జగతి నియతితో నడచును. నియతికి నీతి ప్రాణము. దానిని కాంతా సమ్మితముగా ప్రదర్శింప గలిగినది కావ్యము. అట్టి కావ్యమొక యుత్తమ కళాఖండము.

కావ్యమునందు నీతిని ప్రదర్శించు విధానములు పెక్కులు. పురాణములందు నీతివెనుక కథ నడచును. కావ్యమునందు కథవెనుక నీతి నిలచును. ఇవి కవియొక్క వృత్తినిబట్టి మారవచ్చును. పండిన లోకానుభవముతో హృదయభాండము నిండియుండ కవిఆవేశపరవశుడైనపుడు అప్రయత్నముగా అతని గళమునుండి ఒకగాథ రాగరంజితముగా వెలువడును. అతడు రసికుడైనచో నద్ది శృంగారాత్మకమగును. ధార్మికుడైనచో నీతిబోధకమగును. ఒక్కొక్కసారి కవి రెంటిని ప్రదర్శించి సవ్యసాచి కాగలడు. హాలుడు రసికశిఖామణి. అతని గాథాసప్తసతి శృంగార రసాత్మకమైనను. నీతి వాహితము నైనది. అది ఒకనేర్పు భర్తృహరి శృంగార వైరాగ్యశతకముల యందలి నేర్పు మరియొక తరగతి. ఒకశతకము విరాగులను సరాగులఁజేయును. మరియొకటి సరాగులను విరాగులఁజేయును. వేమన కూడా

వారికోవకు చేరినవాఁడే. అతని పలుకునుడి వేరు. విషయమును ఆగబట్టలేక ఆటవెలఁదిని ఆలాపించు పద్యమొక్కొక్కటి ఒక్కొక్కగాథ. దానినే వచ్చును. లేక సూక్తి అనవచ్చును. కాని వాని నీతిని ప్రతిపాదించుట.

శ్రీ సూకల సత్యనారాయణ శ్రౌతిగారు ఆర్యోక్తిస ప్తశతిపైశాఖకుచెందినది ఈగ్రంథము శతకములు కూర్పవలెనని యుద్దేశించినట్లు కానన భర్తృహరి నీతిశతకమునందువలె వీరును ప్రథమ చతుర్థ శతకములకు సుజనపద్ధతి, దుర్జనపద్ధతి, పద్ధతి అని విభాగములొనరించి యున్నారు.

"తెలుగు సామెతలు" పద్యములందుకూ రంజకముగా వ్రాసియున్నారు. వస్తుతః సామెత కలు. వానినుపయోగించు కవి చాల జాగరూకతయ చూపింపవలెను. శ్రీ శ్రౌతిగారన్నట్లు "ఎట్టి సా నట్టి కవిత" రసపోషణ కనువుగా వానిని క దుపయుక్త పరుపవలెను. తెలుఁగున అట్టి నేర్పు తాంబూలము నాచనసోమునిది. అందువలననే రసపోషణ చక్రవర్తి అయినాడు. శ్రౌతిగారికి వెన్నతో పెట్టిన విద్యగానున్నట్లు ఈ గ్రంథ చున్నది.

నన్నయాదులందు నీతి ప్రతిపాదకములగు పద్యము లెల్లడలను చాలవఱకుకందము, ఆటవెలఁది, గీతము, మొదలగు పద్యములుగనే వ్రాసిరి. నీతి ప్రజాహృదయములలో సూటిగా అన్వయముకావలెను. కనుక నట్టిచంద ముపాదేయ మగుచున్నది. శ్రీ శ్రౌతిగారును పై మూఁడురకములగు దేశీవృత్తములనే గ్రంథమున గైకొనిరి. ధారాశుద్ధిగలిగిన వారి కవిత, అన్వయకాఠిన్యములేక జాతీయములతో, ముద్దుల మూటగట్టుచు, ఆడంబరములేక నడచుచుండును. దానికి తోడు వారి ప్రసన్న మనఃప్రవృత్తియు, ఉపాసనాశక్తియు, విపులమైన లోకజ్ఞానము వారి గ్రంథమునం దెల్లెడల ప్రదర్శితము లగుచున్నవి.

మార్కులు, మాష్టరు, నవాబుసాహెబు, అమీరుసాబు, ఫకీరుసాబు, మొదలగు అన్యదేశ్యములను సైతము రమ్యముగావాడి, రసపోషణగావించినారు. వారి "ఆర్యోక్తి సప్తశతి" వారికిగల పూర్వసంస్కృతాంధ్ర కావ్యములందలి గురు పరిచయము వీరి వ్యుత్పత్తిని వ్యక్తపరచుచున్నవి.

ఆంధ్రలోకము వారి గ్రంథమునకు సముచిత గౌరవము నొసఁగి మన్నింతురని ఆశించుచున్నాను.

---

## శ్రీ దివాకర్ల వేంకటావధాని, M. A. Ph. D.

ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్రోపన్యాసకులు.

బ్రహ్మశ్రీ శిరోమణి నూకల సత్యనారాయణ శాస్త్రులుగారు రచించిన "ఆర్యోక్తి సప్తశతి" యందలి శతక చతుష్టయమును సాంతముగఁ బఠించి యానందించితిని. శ్రీ శాస్త్రిగారొక్క సాహిత్యమునందే కాక శ్రౌత స్మార్తము లందుఁగూడ విశేషప్రజ్ఞ కలవారు. దుర్గాదేవ్యుపాసకులు. సప్తశతియందలి భావములు కొన్ని గ్రహించి సందర్భానుసారముగ లోకోక్తులను, తెలుఁగు సామెతలను బొదివి హృద్యమైన యీ శతకహారమును నిర్మించిరి. ఇందలి భావములు గంభీరములు, నీతిధర్మోపేతములై యలరారుచున్నవి. పెక్కు పద్యములు వేమన పద్యములవలె సహజ ధారాశోభితములై ధారణానుకూల్యము కలిగి యున్నవి. ఆంధ్రదేశమునందలి పెద్దలు పిన్నలుకూడ నీతి ధర్మ సౌరభ సముపేతమైన యీ పద్యమాలిక నాఘ్రాణించి యానందము నొందెదరుగాక యనియు. శ్రీ శాస్త్రిగారు మిగిలిన మూడు శతకములనుగూడ నచిరకాలముననే రచించి యాంధ్రుల కందిత్తురనియు నాశించుచున్నాను.

---

## శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య,

ఆంధ్రోపాధ్యాయులు, ప్రభుత్వ ఉన్నతపాఠశాల, శికిందాబాదు.

పూజ్యపాదులగు శ్రీ నూకల సత్యనారాయణ శాస్త్రిగారిచే రచింపబడిన ఆర్యోక్తి సప్తశతిలోని నాలుగు శతకములను, శ్రీచక్రాంకితమైన హ్రీంకారశతకమును, సావధానముగా జదివితిని. లలిత లలితముగా సాగినది వీరికవిత. లలితా మహాదేవికి ముద్దుబిడ్డలువీరు. పట్టినదెల్ల బంగారమొనర్పగల పరశువేదిని వీరికా తల్లి ప్రసాదించినది. ఇట్టి మహాప్రసాదముతోడనే తొల్లిటి కవులు వర్ధిల్లిరని నావిశ్వాసము. వీరి కవితామతల్లికి నాభక్త్యంజలి సమర్పించుచున్నాను.

---

## శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు,

కార్యదర్శి, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు (ఆం. ప్ర.)

శ్రీ నూకల సత్యనారాయణ శ్రౌతిగారు బహుకాలమునుండి నాకు పరిచితులైన పండితవర్యులు. సంస్కృతాంధ్రములయందు, వేదశాస్త్ర పురాణములయందు చక్కని పాండిత్యము కలిగిన వీరు తెలుఁగుభాషలో సులభశైలిని కవనముచెప్పుట మిగుల ప్రశంసనీయము. ఇప్పటివరకు వీరుప్రకటించిన గ్రంథాలనుండి వీరికవిత్వమును ఆంధ్ర పాఠకలోకమునకు పరిచయము గావించినారు.

ఈ "ఆర్యోక్తి సప్తశతి" లోని చక్కని నీతులు ఆటవెలఁదులయందు సరళశైలిలో ప్రకటితమైనవి. ఇది విద్యార్థులైన బాలబాలికలకు మిక్కిలి ఉపయుక్తము మరియు అవశ్య పఠనీయమైన గ్రంథము.

---

## బ్రహ్మశ్రీ కురుగంటి సీతారామయ్యాగారు, M. A.

నిజాంకాలేజీ ఆంధ్రోపన్యాసకులు, శ్రీ భట్టాచార్య బిరుదాంకితులు, హైదరాబాదు.

బ్రహ్మశ్రీ నూకల సత్యనారాయణ శాస్త్రిగారు రచించిన ఆర్యోక్తిసప్తశతిలోని శతక చతుష్టయమును వారి ముఖతఃగాక నేను స్వయముగా చదివి ఆనందించితిని. సరళమైన శ్రౌతిగారి శైలియెంతయు రమణీయము. ఆర్యోక్తులును తెలుఁగు సామెతలును పద్యములలో నిమిడి యర్థవంతము లగుచున్నవి. వేమనపద్యములకును, సుమతీశతకమునందలి పద్యములకు నుద్దియగుపద్యములిందు కలవనుటలో నతిశయోక్తిలేదు. ఈ శతకములు బాల బాలికలకు తప్పక పాఠ్యగ్రంథములుగా నుండదగినవి.

---

## శ్రీ శిరోమణి, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు,

అసిస్టెంటు డైరెక్టరు, సమాచార పౌరసంబంధశాఖ, హైదరాబాదు (ఆం. ప్ర.)

బ్రహ్మశ్రీ నూకల సత్యనారాయణ శాస్త్రిలవారు రచించిన "ఆర్యోక్తి సప్తశతి" లోని సుజనపద్ధతి, దుర్జనపద్ధతి, తెలుఁగుసామెతలు, వైరాగ్యపద్ధతి అను నాలుగు శతకములను చాలభాగము చూచు భాగ్యము నాకు కలిగినది. భావము చకును భాషకును ఈ గ్రంథమున సామరస్యము చక్కగా కుదిరినది. వీరి పద్యములను చదువునపుడు భర్తృహరి సుభాషితములు ప్రతి పదమునను జ్ఞప్తికి వచ్చుచుండును.

శ్రీ శాస్త్రిలవారెన్నుకొన్న విషయము పిన్నలకును, పెద్దలకును గ్రాహ్యమై ఉపదేశకరముగా నున్నది. తెలుఁగుదేశమున వాడుకలోనున్న సామెతలను క్రోడీకరించి పద్యరూపమున సంతరించి శ్రీ శాస్త్రిలవారు భాషకును దేశమునకును పరమోపకారము చేసినారు.

ఈ సప్తశతిలోని పద్యములు పాఠశాలా విద్యార్థులకును, గ్రంథాలయములకును, సారస్వత సంస్థలకును చాల నీతిబోధకములుగను, ఉపయోగకరములుగను ఉన్నవి. ఈ కృషి సఫలమై యితోధికముగా లోకోపకారకములగు కృతులను రచించుభాగ్యము శ్రీమాత శ్రీ శాస్త్రిలవారికి ప్రసాదించుగాక.

---

## శ్రీ శిరోమణి, చెలమచర్ల రంగాచార్యులుగారు,

ఆంధ్రోపన్యాసకులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు (ఆం. ప్ర.)

మిత్రవరులును, విద్వద్వరేణ్యులు నగు బ్ర॥ వే॥ శ్రీ నూకల సత్యనారాయణ శ్రౌతిగారిచే రచింపఁబడిన "ఆర్యోక్తి సప్తశతి" లోని నాలుగు శతకములను చదివి యానందించితిని. ఈ నామము దీనికెంతయు తగియున్నది.

వాఙ్మయమునకు లోకోక్తులు రత్నస్ఫూర్తులై వెలయును. చిరానుభవసిద్ధములయిన యీ సూక్తులలో మానవుల కత్యంతావశ్యకములగున వెన్నియో నీతులు పూవులతోఁ దావులవలె నుండి పాఠకుల డెందముల నలరింపఁ జాలుచున్నవి.

ఆంధ్రవాఙ్మయమున వేమనాదులు ఈ సరణిలోనే రచనలు సాగించి లోకమునకు మేలును చేకూర్చియున్నారు.

ఆటవెలఁదివంటి చిన్నపద్యములలో నిమిడియున్న యీ నీతులు తేలికగాఁ గంఠస్థము చేయఁదగి చిరకాలము పాఠకులకు కంఠభూషణములగుచు నభ్యుదయ హేతువులగుచుండును.

శ్రీ శాస్త్రిగారు వివిధ నీతిగ్రంథములనుండియు, వాడుకలోనుండు పెక్కు సామెతలనుండియును సారమును గ్రహించి యీ "ఆర్యోక్తి సప్తశతి" ని సంతరించి యున్నారు.

భావముల కనుగుణమగు భాషతో నీకృతి సుందరముగా నున్నది. నీతిదాయకమైన యిట్టి గ్రంథమును రచించిన శ్రీ శాస్త్రిగారు ప్రశంసార్హులు.

ఈ కృతి ముఖ్యముగా విద్యార్థులు పఠించుట కుద్దేశింపఁబడినది. ఇది సారస్వత సంస్థలను, గ్రంథాలయములను, పాఠశాలలను నలంకరింపఁదగియున్నది.

---

## విద్వాన్, కవిచంద్ర, మేడేపల్లి లక్ష్మీకాంతముగారు,

మెథడిస్టు హైస్కూలు తెలుఁగు పండితులు, హైదరాబాదు (ఆం. ప్ర.)

బ్రహ్మశ్రీ శిరోమణి నూ. స. శాస్త్రిగారు రచించిన "ఆర్యోక్తి సప్తశతి" లోని చతుశ్శతిని చదివితిని. వీరికృషి ప్రశంసార్హము. దీక్ష అకుంఠితము. శ్రీ శాస్త్రిగారు అనేక లోకోక్తులనుచేర్చి సులభశైలిలో నీ శతకములను రచించిరి. దీనియందు కనుపించు భాషయు భావములును పాఠకులను నీతిమంతులుగా నొనర్చుట కెంతయు నుపయుక్తములుగా నున్నవి.

శ్రీ శాస్త్రిగారు గనులయందు రత్నములవలె నెచటనోదాగియున్న అమూల్య సూక్తి రత్నములను ద్రవ్వి తీసి శాణితమొనర్చి యిందు వానిని బొందుపఱచి శారదాంబను నా రత్నహారములతో నలంకరించిరి. కావ్యమునందువలె కవితాశిల్పమున కిందంతగాఁ బ్రసక్తిలేదు. అట్లని వీరద్దానిని జారవిడువనులేదు. ఉపమా, ప్రాస, శ్లేషా, ర్థాంతర న్యాసాద్యలంకార శోభితమైన నిర్దుష్ట కవిత్వ మెవ్వని హృదయము నలరింపదు ?

వ్రాయను జదువను నేర్చినవారెల్లరు నీ పద్యములను జదివి సులభముగా నర్థము చేసికొనగలరనియు పద్యములను ముఖపాఠము చేయగలరనియు నా విశ్వాసము.

సనాతన ధర్మాచార పరాయణులును, శ్రీ లలితోపాసకులును, శ్రీ చక్రార్చనాపరులు నగు శ్రీ శాస్త్రిగారికి భాషారూపిణియగు శ్రీ లలితా త్రిపురసుందరి సర్వవిధముల కవితకు సహాయమొనర్చుచుండ నోపునని నా నమ్మకము.

విద్యార్థులకును గ్రంథాలయములకును విద్యాసంస్థలకును ప్రతి యాంధ్ర సోదరునకును నీ పద్యములు మహోపకార మొనర్చునని వేరుగా చెప్పనక్కరలేదు.

ఆ. వె. "వనితయుఁ గవితయును వరియింపఁ దానెయై
యుప్పతిల్లు రసము లొప్పు మీర
బలిమితోడ దానిఁ బడయు నెంచితి మేని
రసము భంగ మగుచు రచ్చ కెక్కు".

ఈ వాక్కు లర్థవంతములైనవి. ట్టి మచ్చుతునుకలు ఇందెన్నియో కలవు.

---

## శ్రీ బిదురు వెంకటశేషయ్యగారు, M. A.

ప్రధానాంధ్రోపాధ్యాయులు. మహబూబుకాలేజీ హైస్కూలు, శికిందాబాదు.

బ్ర॥శ్రీ శిరోమణి శ్రీ నూకల సత్యనారాయణ శాస్త్రిగారు తాము ఆంధ్ర కవితా క్షేత్రములోఁ బ్రవేశించినదే తడవుగా వారు దేశీయుల యుపభోగార్థమై సమర్పించిన తొలిపంటయే యీ "ఆర్యోక్తి సప్తశతి." ఈ చతుశ్శతిలోని ఆర్యోక్తులు అందఱికిని అనుకూలములగు సత్యోక్తులయి గ్రంథకర్తృ నామమును సార్థక పఱచుచున్నవి. వీరును వేమనవలె ఆటవెలఁదినే గ్రహించి తద్వృత్తమును చతుర్విధాభినయముల చమత్కారముతోనింపి ఆంధ్రుల హృదయరంగమున పలుకుల వెలఁది నాడించి ఆనందపరవశులను గావించుటకుఁ బ్రయత్నించి చాలవఱకుఁ గృతకృత్యులైనారు.

తెలుఁగుసామెతలను రెండు శతకములలోను తప్పక ప్రతి పద్యములోను ఒకటి రెండు లోకోక్తులనిమిడ్చి తమ కవితను ప్రజాజీవితమునకు సన్నిహితపరచి

ఒకవిధముగాఁ "ప్రజాకవి" యనుటకు మార్గము వేసికొన్నారు. ఇట్టిగ్రంథమును సహృదయులై సమాదరించి శ్రీ శాస్త్రిగారికిఁ దగిన ప్రోత్సాహమొసఁగి యితోధిక గ్రంథరచనాకృషిలో వారికన్నివిధములఁ దోడుపడుట ఆంధ్రప్రజానీకముయొక్క ధర్మము. పాఠశాలలందును, గ్రంథాలయములందును, ప్రతి ఆంధ్రకుటుంబ మందును, విద్యాసంస్థలందు నుండతగిన గ్రంథము.

---

## మహాకవి శిరోమణి శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు,

దివ్యవాణీ పత్రికా సంపాదకులు, శికింద్రాబాదు.

పూజ్యులును శ్రౌత స్మార్తాగమ సంస్కృతాంధ్ర భాషావిశారదులు నగు బ్రహ్మశ్రీ శిరోమణి నూకల సత్యనారాయణ శాస్త్రులవారిచే రచింపఁబడిన "ఆర్యోక్తి సప్తశతి" లోని మొదటి నాలుగు శతకములను చదివి యానందించితిని.

ఇందలి చిన్నచిన్న యాటవెలఁదులలోని తెలుఁగు సామెతలు నీతులు పండితులకును, పామరులకును సుబోధకములు. చక్కని సరళశైలి. సంస్కృతాంధ్ర లోకోక్తులు సోదాహరణముగాఁ బద్యములం దిమడ్పఁబడినవి. అందందు శబ్దాలంకారములును, అర్థాలంకారములును కలిగి భావములకు తగిన భాషయు, చక్కని ఉదాహరణములును కన్పట్టుచున్నవి.

ఇవి పాఠశాలలలోని విద్యార్థులకును, గ్రంథాలయములకును వేయేల ప్రతి ఆంధ్రునకును గూడ నుపయోగపడగలవని మా భావము.

---

## విద్వాన్, సరిపెల్ల విశ్వనాథ శాస్త్రిగారు, M. A.

విద్వత్కవిరాజ, కవికులశేఖర, ప్రాచ్యసాహిత్యప్రవీణ,
నిజాంకాలేజీ ఆంధ్రోపన్యాసకులు. హైదరాబాదు (ఆంధ్రప్రదేశ్).

శ్రీయుతులు శిరోమణి, నూకల సత్యనారాయణశాస్త్రిగారి "ఆర్యోక్తి సప్తశతి" యందలి సూక్తులు నీతిముక్తా సూక్తులయి, చదువరుల హృదయముల నమలము లయి, వృత్తముల సువృత్తములయి, అణిముత్తియముల హారమయి, గ్రీవా లంకారమయి యలరారుగాక. ప్రతి యాంధ్రసోదరుఁడును తెలుఁగుసామెతలను కంఠాలంకారముగ ధరించి శోభ నందునుగాక!

# సవరణ

తృతీయ శతకమున 78 పద్యములో 'పైకము' నకు బదులు "విత్త"మనియు, 112 పద్యములో 'పూర్తి తృప్తి' కి బదులు "తృప్తి పూర్తి" యనియు, 154 పద్యములో 'వెదకినరీతి' యనుటకుబదులు "వెదకినట్లు" అనియు, 237 పద్యములో 'భక్తి కలిగిననాడొ' అనుటకుబదులు "భక్తి కలుగు నాడొ" అనియు సవరించుకొన వలయును. ఇతరస్థలము లందుగల స్వల్ప దోషములను పాఠకులు సవరించుకొన దగినవి.

గ్రంథకర్త.

శ్రీ శారదాంబాయై నమః

# ఆర్యోక్తి సప్తశతి

## ప్రథమ శతకము

### సుజన పద్ధతి

కం. శ్రీవిద్యకు, శ్రీమాతకు,
శ్రీ విద్యాదైశికునకు, శ్రీ చక్రముకున్
శ్రీ విద్యోపాసకునకు,
నేవిధమగు భేదమైన నెన్నఁగఁదగునే ? 1

ఆ. వె. అంధుఁడనై యుండ నజ్ఞాన తమమున
జ్ఞాన కజ్జల మిడి చక్షువులను
ఒరచి జ్ఞాననేత్రి మున్మీలితము చేసి
'తత్పద'మ్ముఁ జూపె దైశికుండు. 2

ఆ. దేవి ! నీదు మనువు దీక్షతో జపియించి
వేలకొలఁది జనము వెడలె దివికి
భువిని నిన్నుఁజూచి దివికేగు నరులను
వ్రేళ్ళమీఁద లెక్క పెట్టవచ్చు. 3

ఆ. దేవి ! వే కరముల వే వరమ్ములనీయఁ
జేతనగునె ? యొక్క చేతఁగొనఁగ
జలదుఁడుదకబిందు జాలమ్ము వర్షింపఁ
జాతక మ్మిదెన్ని వాతఁగొనును ? 4

తే. గీ. తైలపాత్రింబు వర్తియుఁ దైల మగ్ని
వాయు, వెద్దాని వెల్గించు వ్యక్తిలేక
సాధనాఒంత నిరపేక్ష జగతివెల్గు
దివ్వె నేఁ గొల్తు చిన్మయ దీప శిఖను. 5

ఆ. వె. విమల దీపమాత్మ వేర్వేరు రంగుల
నాల్గు దర్పణములె నలు మతములు
వరుసఁ జూడ దానిఁ బలు రంగులగు కాంతి
చిదుప దర్పణముల చిన్మయంబ ! 6

సీ. కాననంబులఁ గొట్టి కలములుగాఁజేసి
జలధులలో రంగుఁ జక్కఁ గలిపి
ఆహార నిద్రోప హారముల్ విడనాడి
భువన రూపములైన పుటలయందు
లలి నహోరాత్రముల్ ప్రలయాంత మగుదాక
వేయి హస్తములను వేగవ్రాయ
నంబ ! నీ గుణగణం బవతారలీలలు
వ్రాయ నగునె ? కొంత భాగమైన

ఆ. వె. అట్టి నీదు మహిమ నెట్టుల వర్ణింతు ?
జిహ్వ యొకటి రెండు చేతులుండ
నన్ని విధములందు నసమర్థుఁడను నన్నుఁ
గరుణఁ జూడు భక్త కల్పవల్లి ! 7

ఆ. సజ్జనాళిఁ జేరు సామాన్య జనునకుఁ
గలుగు విబుధ తుల్య గౌరవంబు
కనక మిళిత మైన కాంస్య తామ్రాదుల
మూల్య మమలకనక మూల్య సమము. 8

ఆ. రతనపు వెల నెఱుఁగు రత్నశోధకుడు, స
త్కవుల సరస కవితఁ గాంచు సుధియుఁ
గస్తురిఁ గొను గుణియుఁ గలుగఁ డెల్లెడలను
రిత్త యౌనె ? కొనెడి ఱేఁడు లేఁడె ? 9

సుగుణ దుర్గుణముల కగు భేదమును గుణి
యెఱుఁగు, నొరులు దాని నెఱుఁగ లేరు
మాలతీసుమముల మంచిగంధము నాస
యెఱుఁగుఁ గనులు దాని నెఱుఁగఁ గలవె ? 10

సుజను నాశ్రయించు క్షుద్రుఁడెందేనియు
నింద్యుఁడయ్యు నతఁడు వంద్యుఁ డగును
శూలినాశ్రయింపఁజాలిన వృషభమ్మె
పశువెయయ్యు గౌరవంబుఁగనదె ? 11

సుజను నెఱుఁగ వలయు సు విచిత్ర వ్యజనమ్ము
సాధువంశమందు జననమంది
తిరిగి నాల్గు దిశల దరి చేరి కూర్చున్న
జనుల తాపములను శాంతి పరచు. 12

అంజలి నిడు పూవు లా కరద్వయమును
తగిన రీతి వాసితముగఁ జేయు
సుమ, సుజనులకెందు సోదర వృత్తియే
వామ దక్షిణములఁ బరఁగు చుండు. 13

సజ్జనుండు పలుకు సరసమౌ నొకమాట
జాతిమీఁద వ్రాయు వ్రాత యద్ది
ఖలుఁడు పలుకుచుండు కల్లలు పదివేలు
నీటిమీఁద వ్రాయు మాట లవ్వి. 14

తెలుపు హంసరంగు తెలుపు కొంగల రంగు
భేద మెఱుకపడెడి విధము వేఱు
క్షీర నీరములను వేఱు చేయఁగ హంస
హంస యగును, కొంగ యగును కొంగ. 15

దైవ విప్లవమునఁ దామర తూఁడులీ
పుడమియందు లేక పోయెనేని
కోడి వలెన్తే హంస పేఁడ కుప్పలలోన
మసలఁబోదు విడచి మానసమ్ము. 16

జనుఁ డనుదినముఁ దన చరిత మెట్లున్నదో
తాను తెలియ వలెను, దానఁ దనదు
చరిత నీచజంతు చరితకు సమమౌనా
సాధుచరితమునకు సమమొ తెలియు. 17

ఆంధ్ర కవుల నన్న పార్యుండు లెస్స, స
మ్రాట్టులందుఁ గృష్ణ రాట్టు లెస్స
దేశ గణన నాంధ్రదేశమ్మె లెస్స యా,
"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స." 18

ఆ. మదమునణఁచి విద్య మనుజు సుజనుఁ జేయు
ఖలున కదియె మదముఁ గలుగఁజేయు
తమము నణఁచి యినుఁడు తగుకాంతి నొసంగు
గూబకాతఁ డొసఁగు గ్రుడ్డితనము. 19

ఆ. గురుఁడు జ్ఞానమొసఁగుఁ గుమతికి సుమతికి
సుమతియందు విద్య శోభనొందు
మిత్రుఁడొసఁగు గాంతి మృదమునకు మణికిఁ
రత్నమందు కాంతి ప్రతిఫలించు. 20

ఆ. అబ్ధి యెవని నెపుడు యాచింప దుదకముఁ
గాని నదులు యోగ్యుఁ గాంచి వచ్చు
యోగ్యుని వరియించు భాగ్యలక్ష్మియె, గాన
ముందు యోగ్యతలను బొందవలెను. 21

ఆ. సాధు దర్శనమ్ము సమకూర్చు పుణ్యమ్ము
తీర్థ దర్శనమ్ము తీర్చు వాంఛ
సాధు దర్శనమ్ము సద్యః ఫలదమౌను
దీర్ఘ కాలికమ్ము తీర్థఫలము. 22

ఆ. ఉత్తములను గూడి యుత్తమమగు మతి
మధ్యములను గూడి మధ్యమమ్ము
అధములఁ గలసి యది యధమమై వర్తించు
నాశ్రియాఽనురూప మగును ఫలము. 23

ఆ. మకరి నీటనుండి మత్తేభమును బట్టు
విడువ నీరు, దాని వేఁపి పట్టు
స్థాన బలము గాని దాని కా బలమేది ?
యాను కూల్య, సత్య, మార్యసూక్తి. 24

ఆ. గొప్పవారి మైత్రి కొద్ది ప్రాప్తించిన
క్షుల్లక జనుఁడైన శోభనందు
కజ్జలమ్ము కూడి కాంతా విలోచన
ములను మిగుల శోభ నలరుగాదె ! 25

ఆ. పదము సంస్కరింప పద్యకావ్యంబగు
పసిడి సంస్కరింప వస్తువగును
పాలు సంస్కరింప మేలైన పెరుఁగగు
జీవు సంస్కరింప దేవుఁ డగును. 26

ఆ. పద్యములను వ్రాయు హృద్యంబు గాఁగవి
రాజ సభలఁ జదువు రసికుఁ డవ్వి
తరులు సుమము విచ్చు పరిమళయుతము గా
వాయు వెల్ల చోట్లఁ బఱచు వాని. 27

ఆ. కాల్ప నోర్చు పసిఁడి, ఖండింపగా నోర్చు,
జాతి సాన మీద రాయ నోర్చు;
తుచ్ఛమైన గుంజ తోఁ దూఁచఁ దాృసులో
నీచ తులన కోర్వ నేర దౌర ! 28

ఆ. అన్న దాన మహిమ యధికమౌ నవనిలో
నంత కంటె విద్య యధికమగును
అన్నమిడిన తృప్తి యంతలో నంత మౌ
చదువు వలనఁ దృప్తి చచ్చు దనుక. 29

ఆ. వ్యాఘ్రి చర్మము, మఱి పరమ లుబ్ధుని సొమ్ము,
వీరవరుని చేతి నారసమ్ము,
సతి కుచయుగళమును, సమమగు నీ నాల్గు
వారి జీవ ముండు వఱకు రావు. 30

ఆ. శూర్ప మిల వివేకి సుజనుని సరిపోలు
గుణములఁ గొనుచు నవ గుణము విడువ;
మంచి వస్తులఁ గొని మట్టిఁదోృయును చేట
బాగుఁ దాల్చి సుజనుఁ డోగు విడచు 31

ఆ. వేదము లిల నాల్గు వెలయఁగ నొకప్రక్క
బ్రహ్మచర్య మొక్క పక్కఁ దూగు
సర్వ పాపచయము సరితూగ నొకప్రక్క
నొక్క మద్య మొక్క ప్రక్కఁ దూగు. 32

ఆ. సజ్జనుఁడు సుజనుని సన్మానమును జేయు
జగతి ఖలుఁడు వాని సరకుఁ గొనఁడు
శివుఁడు శశిని తనదు సిగపూవుగాఁ దాల్చె
మొఱకు రాహు వతని సరకుఁ గొనునె ? 33

ఆ. ఖల పరివృతులైన కవిత సజ్జనులలో
ఖలుల చరిత వలన కాదు వికృతి
సర్పవేష్టితమగు చందన వృక్షము
సర్ప విషమువలనఁ జనునె? వికృతి. 34

ఆ. స్వల్ప గుణమె యయ్యు సజ్జన సంగతిన్
గౌరవమ్ము నద్ది గాంచుచుండు
త్రాడు పూలతోడఁ గూడి యుండుటఁ బూల
తోను పడఁతి సిగను దానిఁ దాల్చు. 35

ఆ. క్ష్మాతలమె వశమగుఁ జతురంగ బలమున
జనపతుల కిల నది జయముఁ గూర్చు
వశమగు భువి దివియుఁ బంచాంగ బలమున
జన్నిగట్టులకిది జయముఁ గూర్చు. 36

ఆ. దూత పోయి వార్తఁ దొలుదొల్తఁ దేలేఁడు
భువికి దివికిఁ జూడఁ బొత్తు లేదు
రవి శశులకుఁ గలుగు గ్రహణ మోక్షాదుల
నెఱుఁగు వాఁడె దేవు నెఱుఁగు వాఁడు. 37

ఆ. భూవుఁ డిల నగాధ కూపమ్ము కరణి, న
గాధ హృదయుఁడగును, కనెడి నరుని
గుణులును, ఘటకులును, గొనిపోవ కుండిన
జీవి కెట్లు దొరకు ? జీవనమ్ము. 38

ఆ. క్షీర నీరములను వేఱుచేయును మీను,
మీనముల నెవరును మెచ్చుకొనరు
"క్షీర నీరములను వేఱుచేయు" నటంచు
పుణ్యముననె హంస పొందెఁ గీర్తి. 39

ఆ. సజ్జనాఽళి నడచు సన్మార్గమునఁ బోవ
శక్తి చాలకున్న సాగునంత
ఆచరించు సుజనుఁ డందును శుభముల
మంచి చేయువాఁడు మహిని చెడునె ? 40

ఆ. పరుల నింద లేక, పరుల యాచింపక,
పరులఁ గోప పడక, పరులు తమ్ముఁ
బిలువకున్నఁ బోక, పృథ్వి సజ్జను బోలి
శ్రేష్ఠ గుణములుగల శిలయు శివుఁడె ! 41

ఆ. పుణ్యగంగఁ గలసి పూతమౌ నుదకమ్ము
శుక్తినిఁబడి యదియె ముక్త యగును
మద్యపాత్రినుబడి మద్యమౌ సలిలమ్ము
ఆశ్రియాఽఽనురూప మగును ఫలము. 4

ఆ. పచ్చి కసవునుదిని యిచ్చు దుగ్ధము గోవు
వ్యాళమొసఁగు విషముఁ బాలు త్రాగి
క్షీర మాయువొసఁగు క్ష్వేళ మద్ది హరించు
పాత్రి ననుసరించి ఫలము కలుగు. 4

ఆ. వేయి సార్లు చెప్పి వేసారగా నేల ?
"సుజన సంగ మొసఁగు శుభము" లనుచు
వార్ధి తటమునఁగల పాదపముల ప్రక్క
కమల మణులఁజేర్చు నలలు కనుము. 4

ఆ. సాధు సంగమంబు చక్కఁజేయును ఖలు,
ఖలుని సంగతి యటు సలుపఁ డితరుఁ,
బుష్పసురభి మృత్తు మోద యుక్తము సేయు
మట్టి వాసన పువు నెట్లు చేరు ? 45

ఆ. తినుటకొఱకె నీవు మనుచు నుంటివా, లేక
మనుటకొఱకె నీవు తినెదొ, తెలుపు
తినుటకొఱకె మనినఁ దనువుండుటయె వృథ
మనుటకొఱకె తినిన మునులఁ గనుము. 46

ఆ. వేణు నాశ్రయించి వీణ యౌ తుంబిక
యతుల కరమున నది యగును పాత్ర
తరి యగు నదియె నదిఁ దాట నాశ్రయమయి
ఆశ్రయానురూప మగును ఫలము. 47

ఆ. చెడుగుల నుడిగించుఁ, జిత్త శుద్ధిని సేయుఁ,
బూర్వ పాపములను బోనణంచు,
సర్వభూత దయను సమకూరుచును, సాధు
సంగ మొసఁగు సర్వ మంగళముల. 48

ఆ. శుక్తిని బడు జలము శుద్ధ మౌక్తికమగు
ఉష్ణపాత్రిను బడి యూష్మ మగును
తామరాకునఁ బడి తనరు ముత్తెము రీతి
నాశ్రియాऽऽనురూప మగును ఫలము. 49

ఆ. సాధు సంగమంబు సన్మంగళప్రద
మున్నతి కది హేతు వన్నఁ, దగదె ?
మలిన జలము కలిసి మహిత గంగానదిన్
ప్రాజ్యముగ నదియును పూజ్యమగును. 50

ఆ. సాధు సంగమంబు సన్మంగళ ప్రద
మున్నతి కది హేతు వన్నఁ దగదె ?
విష్ణు హస్తమందు వెలయుట శంఖంబు
ప్రాజ్యముగ నదియును పూజ్య మ్మగును. 51

ఆ. ఇంధనము మలయజ గంధము వలననే
చందన మహిజంపు చంద మగును
సుజన సంగతి నటు సుజనుఁడౌ ఖలుఁడు
ప్రాజ్యముగ నతఁడును పూజ్యుఁ డగును.

ఆ. వేణు నాశ్రయించి వీణయై తుంబిక
ముద్దులాఁడి కుచము ముద్దులాడు
భిక్షు నాశ్రయించి బిచ్చపు పాత్రమౌ
నాశ్రయాఽనురూప మగును ఫలము.

ఆ. చందనమ్ము జగతిఁ జల్లనౌ నంతకు
శీతకరుఁడు మిగుల శీతలుండు
చంద్ర చందనముల చల్లఁదనము కంటె
సాధు సంగతి హృద యాఽధి హరము.

ఆ. గంగ పరిహరించుఁ గల్మషముల నెల్ల
కల్పవల్లి లేమిఁ గాటు పఱచు
చందురిఁ డపనయించు జనుల తాపములన
సాధుమైత్రి మూటి శాంత పఱచు.

ఆ. సాధు జనుల తోడ స్పర్ధయైనను మేలు
ఖలునితోడ మైత్రి కలుగు కంటె
సింహ మెగిరి తన్నుఁ జెనకి తన్నిన మేఁ
ఖరముమీఁద నెక్కి తిరుగు కంటె.

ఆ. కనఁబడు సుజనుండు కాఠిన్య సహితుఁడై
కృప కలుగుచు, నారికేళ మట్లు,
కానఁబడును పైకి ఖలుఁడిల సుముఖుఁడై,
పైకి తళుకు కలుగు బదర మట్లు. 57

ఆ. పాపములను గంగ, తాపములను శశి,
కల్పతరువు లేమిఁ గ్రిమత నణఁచు
పాప, తాప, దైన్య పటలములను, సాధు
దర్శన మ్మణంచు త్రయము నౌర ! 58

ఆ. కల్ప వృక్ష మొసఁగు కాంక్షించు వరమునే
కామధేను వొసఁగు కామితమునె
చింతితార్థ మొకటె చింతామణి యొసంగు
సకల మొసఁగు సాధు సంగమంబు. 59

ఆ. సుజన సంగతుఁ డగు సుజనునిఁ గలియ, న
సాధ్య కార్యమును, సు సాధ్య మగును
పువులతోడి చీమ శివు శిరమునఁగల
ముద్దు చందురు మోవి ముద్దుఁ గొనదె ! 60

ఆ. తీర్థ దర్శనమ్ము దేశవాసుల తీరు
సాధు మైత్రి సుజన సంగమంబు
వర్తకమును, చిత్ర వస్తు దర్శనమును
దేశయాత్ర వలనఁ దెలియనగును. 61

ఆ. ఎవఁడు సంచరించు నెల్ల దేశములను,
ఎవఁడు విబుధ వరుల నెఱిఁగియుండు,
వాని బుద్ధి లతిక వ్యాపించు నలుదెసల్
వేగ నీటఁ దైల బిందు వట్లు. 62

ఆ. సజ్జనాళిచేత స్థాపింపఁబడు శిల
ప్రాజ్యముగ నదియును బూజ్యమగును
స్వర్ణఘటిత మైన వజ్రపుశిల మాడ్కి
సుజన సంగ మొసఁగు శుభ ఫలమ్ము. 63

ఆ. కవియుఁ బ్రకృతినుండి కావ్య వస్తువుఁ గొను
ప్రకృతినుండి శాస్త్ర పటిమ హెచ్చు
ప్రకృతినుండి కలుగు బ్రహ్మాండమంతయు
ప్రకృతి సర్వమునకుఁ బ్రాతి పదిక. 64

ఆ. హృదయమందుఁ బ్రేమ హీనమైయుండిన
వారు దూరగతులె యూర నున్న
హృదయమందుఁ బ్రేమ హృద్యమై వర్ధిల్ల
దూరగతులె యైన నూర నుంద్రు. 65

ఆ. హితముఁ గూర్చువాఁడు హితుఁడనఁగాఁ జెల్లు
తనకుఁ బెట్టువాఁడె తనదు తండ్రి
నమ్మఁదగినవాఁడె యిమ్మగు సఖుఁడగు
సుఖముఁ గూర్చునట్టి సుదతి భార్య. 66

ఆ. వస్త్ర మొకటి నరుని పరమ యోగ్యునిఁ జేయు
వేషమొకటి లేక విలువ లేదు
పట్టుఁజూచి హరికి పట్టినిచ్చెను వార్ధి
శివుని చర్మముఁగని చేదు నొసఁగె. 67

ఆ. బలి కృతయుగ మందు భార్గవుం డట త్రేత
ధర్మరాజు దాత ద్వాపరమున
ఏడి దాత కలిని? ఋణదాతలను గూర్చి
దాత లేని లోటు ధాత తీర్చె. 68

ఆ. నందనమున దాఁగె నాకల్పవృక్షము
సురభువనము నందు సురభి దాఁగె
ఏడి దాత భువిని? ఋణదాతలను గూర్చి
దాతలేని లోటు ధాత తీర్చె. 69

ఆ. కాలకంఠుఁడుండె కైలాసగిరియందు
విష్ణువుండె పాల వెల్లి లోన
ఏడి దాత భువిని? ఋణదాతలను గూర్చి
దాత లేని లోటు ధాత తీర్చె. 70

ఆ. వారణాశిలోని వర్తకులకు నెంత
లాభ, మెంత దైవ వైభవంబు
అంచితముగ నొకటి పంచత్వమును బొంది
యష్ట విధములగుచు దృష్ట మగును. 71

ఆ. కోకిల నినదమ్ము కోమలమై యుండు
కాకసంగతి నది కలసి యున్న
సాధుజనుల మనము సరసమై యుండును
ఖలుల సంగతి నది మెలఁగుచున్న. 72

ఆ. పదవి వీడకున్న పద్మ మిత్రులు గారె
రవియు జలము దలఁప, నవియె దాని
వీడ రిపులగుదురు, "పెఱవారు పదవులు
గలుగునాడె మనల గౌరవింతురి." 73

ఆ. వాణి, విద్య, హయము, వీణ, శాస్త్రము, నారి
జనుఁడు భువిని వీరి చరితఁజూడు
చెడ్డవారిఁజేరి చెడుగును గడియించు
మంచివారిఁజేరి మంచిదగును. 74

ఆ. అతి సుదూరవస్తు వది కాన రాకుండు
నతి సమీపమైన నదియు నటులె
అధికలవణ సహితమగు పదార్థము చెడు
నతిని విడువవలయు నన్నిచోట్ల. 75

ఆ. ఆనుపూర్వ్య మగును ననుకరణము జీవి
కదియె సహజ గుణము, నార్యునుండి
బాగు ననుకరించి యోగును విడనాడ
నార్యవర్యుఁడు ననుకార్యుఁ డతఁడె. 76

ఆ. శాంతికలుగు జనుఁడు జయమందు నన్నిట
కోపయుతుల నతఁడు కొంచ పఱచు
శీతలమగు నినుప సేనమ్ము, వేడియౌ
నినుప ఖండములను దునియఁజేయు. 77

కం. కనునది పలుకఁగ నేరదు
తను జూచిన వస్తుఘనత, తాఁబలికెడిదో
కననేరదు వస్తుల, ధర
ఖని నిఁక సత్యవ్రతమ్ము నియితం బెటులో. 78

ఆ. వనముల వసియించి వన్యాన్నములఁ దిని
కలశభవుఁడు గ్రోలె జలధు లెల్ల
కార్యసిద్ధి జరుగు నార్య సత్వము వల్ల
సాధనాంతరముల సాయ ముడిగి. 79

ఆ. ఏకచక్ర రథము నెక్కి యనూరుతో
నాదితేయుఁడేగు నాకసమున
కార్యసిద్ధి జరుగు నార్యసత్వమువల్ల
సాధనాంతరముల సాయ ముడిగి. 80

ఆ. అబ్ధిదాఁటి రాముఁ డాకపీశ్వరులతో
లంకఁ గాల్చి చంపె రాక్షసేశుఁ
గార్యసిద్ధి జరుగు నార్యసత్వమువల్ల
సాధనాంతరముల సాయ ముడిగి. 81

ఆ. తుమ్మెద గొనయమును తమ్ముల మ్ములఁగొని
యంగహీనుఁడేలు నఖిలజగము
కార్యసిద్ధి జరుగు నార్యసత్వమువల్ల
సాధనాంతరముల సాయ ముడిగి. 82

ఆ. కనకమనగఁ బసిఁడి, కనకము ధుత్తూర
ముర్విఁ గనకమనఁగ నుభయ, మవ్వి
నామ సామ్యముననె నరుల మత్తులఁజేయు
కనుటవలన నొకటి తినుట నొకటి. 83

ఆ. ధనికున కిలఁ గోటి ధనరాశి పెరిగిన
తానె యనుభవించుఁ దనదు ధనము
పేద తనముచేతఁ బీడింపఁబడు, కడు
బీదవారల కది పెట్టు నొక్కొ ? 84

ఆ. ఏనుఁగునకు సీమ, యిల హయమున కూరు,
బట్టెఁబెంచ నొక్క బానిసీఁడు
పొట్టఁబెంచ నొక్క పుట్టెడు ధాన్యమౌ,
నెంతచెట్టు కుండు నంతగాలి. 85

ఆ. హలముచేత మాత హతమార్పఁబడె, కన్న
బిడ్డ చంపఁబడియె విషముచేతఁ
దల్లికిఁ దనయునకుఁ దగువుఁదెచ్చిన యట్టి
స్వర్ణమునకుఁ జేతు వందనములు. 86

ఆ. షష్టిఘటిక లైన సంసార సేవకై
చాల కుండు నెంత కాలమైన
నర్ధఘటిక యైన హరికీర్తనముఁ జేసి
పరమయోగివర్య భక్తిఁగొలువు. 87

ఆ. నాణె మేది లేదు నాకలోకము నందు
విపణివీధి లేదు వెలకుఁ గొనఁగ
ధర్మముదప్ప యొకటి తరతరాలకుఁ జెల్లుఁ
జేయ కున్న దాని చింత వంత. 88

ఆ. మాలఁ జేతఁ జూచి మనసు బంధన భీతిఁ
బాఱు ముజ్జగములఁ జూఱఁ గొనఁగఁ
జిత్తగజము భక్తిశృంఖల బంధింప
విష్ణుపాదమేథి వీడ కుండు. 89

తే. సుతులు కోడండ్రు తనయలు సుదతు లనుచుఁ
గాని పనులను గావించు కలుషబుద్ధి !
కడకుఁ గడతేర్చు కాళిక కాళ్ళుపట్టి
బంధముక్తికి భజియింపు భద్రకాళి. 90

ఆ. శివుఁడు, కేశవుండు, శ్రీదేవి, కాళియు,
శూర్పకర్ణుఁ డేని, సూర్యుఁడేని,
భక్తిఁగొల్వ నిచ్చు భుక్తిముక్తులు మహి
"నానుకూల్య సత్య మార్య సూక్తి." 91

ఆ. తాను లోకమందుఁ దగ జయమును బొంది
తనయుఁజేత నోడఁదలఁచుఁ దండ్రి
తనయుఁ డన్నఁ దనదు తనుశకలమె గాదె ?
తనయు జయ మటన్నఁ దనదు జయము ! 92

ఆ. సూత గంధకములు శుక్లశోణితములౌ
నీశ పార్వతులకు, నిద్ది గలుపఁ
గపిల కజ్జల మగుఁ, గపిలుండు జనియించె
తనయుఁడగుచు వారు ధరణిఁగలయ. 93

ఆ. మృదు వగు నవనీత మింత కంటెను మృదు
వౌను సాధుజనుల మానసంబు
వేడిఁ జేయఁ గరఁగు వెన్న తనదు వేడిఁ
బరుల తాప మెఱిఁగి కరుఁగు మనసు. 94

ఆ. విధిగఁ బంపు ధనము వేఱుదేశము లందు
మనది మనకు దొరకు మాడ్కి మహిని
విధియుతముగ నిచ్చు వివిధ దానములును
విబుధలోకమందు విధిగ దొరకు. 95

తే. పరమ పురుషుని దఱిఁజేరి ప్రకృతి యుండు
సూర్యు విడువక భజియించు భార్యఛాయ
శశిని వీడదు రోహిణి సర్వవేళ
సాధ్వి భర్తను వీడని సరణి భువిని. 96

ఆ. కనకమూ ర్తియందుఁ గమల నాహ్వానింప
జీవశక్తి పుట్టి దేవి యగును
కనక మున్న సర్వకార్యముల్ సిద్ధించు
"భద్రకాళి ధాతుముద్ర నుండు". 97

ఆ. తృణము లఘువు భువిని, దృణముకంటెను దూది
పింజె, దానికంటె బిచ్చగాఁడు,
బిచ్చగాఁడు తన్ను బిచ్చ మడుగు నను
భీతి వాయు వెగుర వేయఁ డతని. 98

ఆ. చిన్నత్రాసు ముఖము, జిహ్వా తక్కెడ సిబ్బి
పండ్లు త్రాళ్ళు, గళము పట్టుత్రాఁడు
మాటలనెడి దినుసు, మాట వాకొనువారి
కిచ్చి మానధనముఁ బుచ్చుకొనుము. 99

ఆ. సరసులౌ సభికులు సరస లేకుండిన
సరస కావ్యగాన మరయ వృథయ
"గ్రుడ్డిమగఁడు భార్య కోమల హావముల్"
గాంచి సంతసంబుఁ గాంచ నట్లు. 100

ఆ. పెరుఁగు దరువఁ బుట్టు వెన్న సుధాసమ
మరణి మథనఁ జేయ నగ్ని పుట్టు,
మానస మను నరణి మనువుతో మథియింప
జ్ఞాన రూప వహ్ని జనన మందు. 101

ఆ. ఏబ దక్షరంబు లెన్ని విద్యలకైన
నాదికారణంబు నదియ యెఱుక
అక్షరంబు లేక నంధకారము సృష్టి
దినకరుండులేని దినము మాడ్కి. 102

ఆ. మంత్రమ్మునకు రాని మాతృ కార్ణము లేదు.
మందు కొఱకుఁగాని ద్రమాను లేదు.
యోగ్యతా విహీనుఁ డుర్వి నెవ్వఁడు లేఁడు,
వాని గోప్య మెఱుఁగు వాఁడె లేఁడు. 103

ఆ. జనునకు ధనము, తరువునకుఁ బండులు, కీర
మునకుఁ బలుకుఁ, బెద్ద పులికిఁ జర్మ,
జంతువునకుఁ బలము, జవరాలునకు సొంపు,
గుణమ యయ్యెఁ బ్రాణ గొడ్డ ముర్వి. 104

ఆ. మంచి నెఱిఁగి యుందు, మదిసేయ నొల్లదు,
చెడుగు నెఱిఁగి యుందు, విడువఁ జాల !!
యేదొ శక్తి నాదు హృదయము నందుండి
చెప్ప నొప్పుఁ దప్పుఁ జేయు చుందు ! 105

ఆ. పాదయుగము జారి పడఁబోవు జనులకు
భూతధాత్రి చేతి కూఁత నొసఁగు
జనని ! షోడశోపచార పూజలఁ జేయ
నూనమైనఁ గాచు నూఁత వీవె. 106

ఆ. కనకమునకు వలెను గావ్య శోధనమగుఁ
దూఁచి, కాల్చి, వన్నెఁజూచి, గీఁచి,
అగ్ని శోధనమున కాఁగునా ? శతకమ్ము,
వెలయు సీస మాఁటవెలఁది కంటె. 107

ఆ. జనని ! భక్తునందు సంపూర్ణదయ యున్న
నెన్ని తప్పులున్న నేమి భయము ?
కన్నతల్లి తనదు చిన్నకొమరుఁ గాచి
బుజ్జగించి యిడదె ! గుజ్జు బువ్వ. 108

ప్రథమ శతకము సమాప్తము.

# ప్రథమ శతకమందలి కఠినశబ్దములకు అర్థములు.

2. కజ్జలము = కాటుక; ఉన్మీలితముఁజేయు = తెఱచు; తత్పదము = అపర తత్వ పదము. దైశికుఁడు = గురువు. 5. సాధనాంతరనిరపేక్ష = ఇతరసాధనముల అపేక్షలేనిది. 8. కాంస్యతామ్రాదులు = కంచు, రాగి మొదలగునవి. 10. నాస = ముక్కు. 11. శూలి = ఈశ్వరుఁడు. 12. వ్యజనము = విసినికఱ్ఱ. వంశము = వెదురు, కులము. 16. మానసము = మానస సరోవరము, మనస్సు. 19. ఇనుఁడు = సూర్యుఁడు. 20. మృదము = మన్ను. 23. ఆశ్రయానురూపము = ఆశ్రయమునకుఁదగినట్లు. 25. క్షుల్లకుఁడు = నీచుఁడు. కాంతావిలోచనము = స్త్రీ నేత్రము. 28. నీచతులన = నీచులతో సరిపోల్చుట. 30. నారసము = బాణము. 31. శూర్పము = చేఁట. 33. మొఱకు = మూర్ఖుఁడు. 36. పంచాంగము = తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు. 38. గుణ = మంచిగుణము (త్రాఁడు). ఘటకులు = సమకూర్చువారు. ఘటము = కుండ. జీవనము = బ్రతుకుఁదెరువు, నీరు. 42. పూతము = పవిత్రము. శుక్తి = ముత్యపుచిప్ప. ముక్తము = మంచి ముత్యము. 43. వ్యాళము = పాము. క్ష్వేళము = విషము. 45. సురభి = వాసన. 47. తుంబిక = సొరకాయ. 49. ఊష్మము = ఆవిరి. 50. ప్రాజ్యము = అధికము. 52. ఇంధనము = కట్టె. మహిజము = చెట్టు. 54. హృదయాధిహరము = మానసికదుఃఖమును బోఁగొట్టునది. 55. అపనయించుట = పోఁగొట్టుట. 57. బదరము = రేఁగుపండు. 64. ప్రాతిపదిక = మూలకారణము. 67. షష్ఠి = కుమార్తె. 68. ధాత = బ్రహ్మ. భార్గవుఁడు = పరశురాముఁడు 71. పంచత్వము = 5 విధములు; మరణించుట. 76. అనుపూర్వ్యము = పరంపరాగతము. అనుకార్యుఁడు = ఆదర్శపురుషుఁడు. 78. నియతము = స్థిరమైనది. 79. ఆర్యసత్వము = మహాత్ముల మహిమ. సాధనాంతరము = ఇతరసాధనము. 82. అంగహీనుఁడు = మన్మథుఁడు. 83 ధుత్తూరము = ఉమ్మెత్త. 83. విపణివీధి = అంగడి. వంత = విచారము. 89 శృంఖల = గొలుసు. మేధి = కట్టువాఁడు. 92. తనుశకలము = శరీరఖండము. 93 సూతగంధకములు = రసగంధకములు. కపిలుఁడు = గణపతి. 95. విబుధలోకము = స్వర్గము. విధిగ = విధిపూర్వకముగ, తప్పక. 97. ధాతుముద్రి = బంగారునాణెము. 99. వాకొనుట = మాటాడుట. 100. సరస = సమీపము. రసము; 101. మనువు = మంత్రము; అరణి = అగ్గిని మధించుకట్టె. 103. మాతృకార్ణము = అక్షరమాల. 104. పలము = మాంసము. 106. భూతధాత్రి = భూమి.

శ్రీ శారదాంబాయై నమః

# ఆర్యోక్తి సప్తశతి

## ద్వితీయ శతకము



### దుర్జన పద్ధతి

ఆ. గుణము గౌరవమ్ముఁ గూర్చును నరునకు
కులము గౌరవమును గూర్చఁబోదు
పాలకడలిఁ బుట్టు కాలకూటమునకుఁ
గులము గౌరవముమ గూర్చెనోటు ? 1

ఆ. కప్పురంపు పొడిని గావించి పాదుగా
మృగమదంపు బురద మెత్తియుంచి
పుష్పరసముఁదెచ్చి పోయ తేఁబవళుల
నుల్లి వీడఁబోదు తొల్లి గుణము. 2

ఆ. చిత్రి కోపవహ్ని చెలఁగు సజ్జనులందుఁ
గుజను లందు వేఱు గుణముఁ గలిగి
శాంతి నొందు స్నేహ సంబంధమున నొండు
స్నేహమొకటి కగును దోహదమ్ము. 3

ఆ. పాము మిత్రి మాట పాడియా నొకనాఁడు
ఖలుఁడు మిత్త్రుఁ డగుటఁ గాంతు మొక్కొ!
శేషుఁడయ్యెఁ బాన్ప శ్రీహరి కానాఁడు
ఆయెనే కురుపతి హరికి హితుఁడు? 4

ఆ. ఉరగ పామరులకుఁ బరగ భేదం బుండు
పాముకంటె ఖలుఁడు పామరుండు
పాము మంత్త్రమునకు బద్ధమై పడియుండు
ఖలుఁడు మంత్త్రములకుఁ గట్టు వడఁడు. 5

ఆ. చెడ్డవానిఁ జేర దొడ్డవానికిఁ గూడ
పీడ కలుగు చుండు చూడు, మగ్ని
కూడి యుండ నినుప గుండ్లను సమ్మెట
పెట్లు తినును ఔమ్ము చిట్లునట్లు. 6

ఆ. పదవి వీడకున్నఁ బద్మమునకు మిత్రు
లౌను రవియు జలము నదియె దాని
వీడ రిపు లగుదురు పెఱలు తను పదవిఁ
గలుగు నాఁడె గాదె! గౌరవింత్రు. 7

ఆ. ఎవఁడు విబుధుల కడకేఁగి సేవింపఁడో
దేశ దేశములను దిరుగఁ డెవఁడు
జగతి వానిబుద్ధి సంకుచితం బయి
వెలయు నీట నాజ్య బిందు వట్లు. 8

ఆ. పనియుఁ బాటు లేక భార్యతోడుత నింటఁ
గూప కూర్మ మట్లు కూరుచుండి
దేశ దేశములను దిరుగని సోమరి
మొద్దు, జ్యేష్ఠలక్ష్మి ముద్దు కొడుకు. 9

ఆ. ఖలుని మనసు సిరులు కలుగంగఁ గఠినమౌ
నదె విపత్తు కలుగ మృదుల మగును
ఇనుము చల్లఁబడిన నినుమడి కఠినమౌ
నదియె తప్తమైన మృదుల మగును. 10

ఆ. పరులనుండి పొంది పదవుల ఖలుఁడు, తాఁ
బరుల కెగ్గు సేయుఁ బలు విధములఁ
దపను నుండి పొంది తాపమ్ము సికత తా
గ్రీష్మమందు జనుల కూష్మ మొసఁగు. 11

ఆ. ఉచ్చరించు చుందు రుపనిష ద్వాక్యముల్
వాని నాచరింప వారు తగరు
కలిని జ్ఞాను లిట్లు కానంగఁ బడుచుంద్రు
హోలి కోత్సవమున బాలు రట్లు. 12

ఆ. ఉదర పోషణమున కుపకరించెడి రీతిఁ
బలుకు నుపనిషత్తు చిలుక వలెను
జిహ్వాయందుఁ జెలఁగు చిలిపి చాపల్యంబు
కలిని జ్ఞాని యిట్లు కాననగును. 13

ఆ. విత్త గౌరవములు మొత్తముగా నీయ
ఖలుఁడు తృప్తి పడక కలఁచు నొరుల
నమృత రసముఁ దెచ్చి యారారఁ బోసినన్
విషఫలమ్ము లిచ్చు ముషిణిచెట్టు. 14

ఆ. ఖలునితోడను పగఁ గలిగి యుండఁగరాదు
ఖలునితోడఁ జేయ వలదు చనువు
కాలుచున్న బొగ్గు కాల్చును గరమును
చల్లబడినఁ జేయి నల్లఁ బఱచు. 15

ఆ. పాము వలెను గాక పామరుం డొకరీతి
వింతపథము కలుగు హంతకుండు
ఒకని చెవిని గొరుక నొకని ప్రాణము పోవు
ఖలుని మాట లందు చెలఁగు విషము. 16

ఆ. చాపఱాయి తెగును శాణముతోఁ గొట్ట
వజ్రపు రవ తెగును వజ్రమునకు
పాము కట్టువడును పరమ మంత్రములకు
ఖలుఁడు దేనికైనఁ గట్టు వడఁడు. 17

ఆ. తనదు ముఖమున బహుధాన్య ఖండనమును
ఎసక మెసఁగి చేయు ముసల మట్లు
తనదు ముఖమున బహుధాఽన్య ఖండనమును
ఖలుఁడు నెసక మెసఁగి సలుపుచుండు. 18

ఆ. సుగుణ దోషములను జూచుచు సమముగఁ
బొగడ నింద చేయఁ బోలి యుండి
ద్వంద్వ దోషములకుఁ దా గుఱి గాకుండు
మూఢుఁ డగునె జ్ఞాని మోక్ష గామి ? 19

ఆ. ఎంత బోధచేయ నేయుపాయముఁ జేయ
ఖలుఁడు సజ్జనుండు కాఁడు జగతి
గ్రహణ కాలమందు గంగలో ముంచినఁ
"గట్టి కుక్క కాదు గంగగోవు" 20

ఆ. సాధు బోధ వలనఁ జక్కనౌచు ఖలుఁడు
వక్ర మార్గములను వదలఁబోఁడు
చమురు ఱాచి తోమి సరిదిద్ది కట్టినఁ
"గుక్క తోఁక వంక కుదురఁ బోదు." 21

ఆ. ఖలుఁడు కలహమునకు గాలు దువ్వును ముందు
ఖలునితోడ వలదు కలహ మెపుడు
నూఱు రూకలిచ్చి నోరు మూసికొనుట
సజ్జనాళి కగును సమ్మతంబు. 22

ఆ. ఖలునకు హలమునకు వలెనె కౌటిల్యంబు
వక్త్రి మందు నుండు వక్రగుణము
వాని వక్రి ముడుప వసుధలో క్షమ తగున్
క్షమకు హలము మాడ్కి ఖలుఁడు నణఁగు. 23

ఆ. కొంత ధనము నొసఁగు నంత క్రిందకు దిగు
ధనము నొసఁగ కున్న తలకు నెక్కు
దినుసువేయ దిగుచు దినుసుఁ దీయఁగ నెక్కు
త్రాసు కొనకుఁ బోల్పఁ దగును ఖలుఁడు. 24

ఆ. వనముఁ గాల్చువేళ వాయు వగ్నికి మిత్రుఁ
డతఁడె దీపరూపు నగ్ని నార్పు
బలిసి యున్న నాఁడు ప్రాణమిత్రుం డగు
వాడె, బక్క చిక్కునాఁడు సూడు. 25

ఆ. తాళఫలముఁ బోలు తనదు దోషములను
ఖలుఁడు కనులఁ గనియుఁ గడకుఁ ద్రోసి
నూవు గింజఁ బోలు నొరుల దోషములను
గొండ లంత చేసి గోల చేయు. 26

ఆ. విశిఖ వ్యాలము లను పేరుల తుదిహల్లు
కలసి ఖలుని పేరు కాగ నతఁడు
పరుల ప్రాణములను బరిమార్చుటే గదా !
వాని జాతి కుచిత మైన విద్య. 27

ఆ. సజ్జను నిల ఖలుఁడు స్వస్థతతో నుండ
కారణంబు లేక కలఁచు చుండు
పూర్ణిమ తిథిఁ గళలఁ బూర్ణుఁడౌ చంద్రుని
రాహువు కబళించు లబ్ధి లేక. 28

ఆ. మంచి వంశమందు మహిని జన్మించియు
ఖలుఁడు ధనువురీతిఁ గలిగి గుణము
పరుల హృదయములకుఁ బరితాపమును గూర్చు
"నాను కూల్య సత్య మార్య సూక్తి." 29

ఆ. ఎట్టి వంశమందుఁ బుట్టునో నీచుండు
చెరచి వంశ మెల్ల చీల్చి చంపు
వేరు పురుగు పుట్టి పెనుఁమ్రాకులను జంపు
"నాను కూల్య సత్య మార్య సూక్తి." 30

ఆ. సుతునిఁ గనని భార్య సుదతి లేని గృహమ్ము
గుణములేని నీచ గుణుఁడు సుతుఁడు
జాతకమ్ముఁ జెప్పఁ జాలని దైవజ్ఞుఁ
డీ చతుష్టయమ్ము వృథయ పృథివి. 31

ఆ. సకల గుణములు గల సరస కావ్యమునుండి
దొరకఁ బట్టు ఖలుఁడు దోషములనె
చుంబ లోహ మబ్ధి చొక్కంపు మణి వీడి
ఇనుప ఖండములనె యేఱు రీతి. 32

ఆ. ఇంటి కంటు పెట్టి యింగిల మార్పంగ
నీటి కొఱకు బోవు నిలను ఖలుఁడు
తగవు లాడఁ జేసి తగవుఁ దీర్పఁగఁ దాను
తగవరి యయి పోవు తగుదు ననుచు. 33

ఆ. కాకి మూకలందు గణుతి కెక్కదు హంస
నక్కలందు గోవు నక్కి యుండు
ఖరము లందు హయము గణుతి కెక్కక యుండు
ఖలుల యందు గుణికి గణన లేదు. 34

ఆ. భువిని వేప విత్తు పూడిచి తేనెయుఁ,
బాలు చక్కెరయును బైన పోయ
వేయి యేండ్లకైన వీడదు తనచేదు
దుర్జనుండు తనదు దోష మట్లె. 35

ఆ. ఈను నావు లేఁగ, నీను మూటిని సింగ;
మీను బెబ్బులి యయిదింటి నేట,
సాధుజంతు వావు సతము వృద్ధిని గాంచు
క్రూర జంతువు పులి కుమిలి చచ్చు! 36

ఆ. ఖలుఁ గలయుటవలన నిల సుజనుని శాంత
మానసమున వికృతి కానరాదు
గడ్డి మంట వలన కడలిలోని జలమ్ము
నందు వేడి కలుగ నగునె? భువిని. 37

ఆ. ధర్మబుద్ధి లేక తగు విద్య లేనట్టి
కన్న కొడుకు తండ్రి కుంట ఖర్చు
ఏటఁ జూలు కొనక యీత లీనని వట్టి
గొడ్డుటావు లుంట గడ్డి ఖర్చు. 38

ఆ. ఖలుఁడును, గఫరోగ మిలను సామ్యము నొందుఁ
బ్రిబలు మధుర వచన వస్తువులను
కటు వచనముల విని కటు వస్తువులఁ దిని
శాంతి నొందు చుండు నంతమందు. 39

ఆ. ఋణము శేషమున్న వ్రణము శేషంబున్న
నగ్ని శేషమున్న నాగిపోదు,
వడ్డి పెరుఁగుఁ, మరల వ్రణము వృద్ధిని బొందు,
రవిలి యగ్ని కాల్చు భవనములను. 40

ఆ. జనులు సుగుణములను గని గౌరవింతురు
వేసములనుఁ జూచి మోస పోరు
గల్లు గల్లు మనెడి కంచు గంటలఁ జూచి
కొనరు పాలు లేని గోవు నెవరు. 41

ఆ. లంచగొండి తనము రారాదు దళి కంద్రు
లంచ మీయ కున్నఁ మించుఁ బనులు
హింస కూడ దండ్రు మాంసపు టంగళ్ళు
వాడ వాడ లందుఁ బరగు చుండు. 42

ఆ. రైతు వలనఁ బ్రబలు రాజును, రాజ్యమున్
రాజు పన్నువేసి రైతు నణఁచు
పుష్పవితతి వలనఁ బుట్టు బిందెలుఁ బండ్లుఁ
బిందె లొదవి పూలఁ గ్రింది కణఁచు. 43

ఆ. వైద్యరాజ ! నీకు వందనం బిదె కొను
మంతకుండు నీకు ననుజుఁ డొక్కా !
యముఁడు ప్రాణములనె హరియించు, నీవన్న
ప్రాణ ధనము లెల్ల నపహరింతు. 44

ఆ. కాక యాచకులను గనుము భేదము మెండు
నీచ కాకికంటె యాచకుండు
కాకి కన్న మిడఁగఁ గాకులఁ బిలచును
యాచకుండు వై రి యాచకులకు. 45

ఆ. విశ్వసింప రాదు వేషములను జూచి
మోసపోవు నరుఁడు వేసముననె
భిక్షు వేషముననె వేంచేసి రాకాసి
మోసగించె సీత నాసఁ గొలిపి. 46

ఆ. పొరక కట్ట యనఁగఁ బరగును లుబ్ధుండు
వారి చై దములను బరఁగు సమత
తుడిచి పొరకకట్ట దుమ్ముఁ గుప్పగఁ జేయుఁ
దాను దినక గూర్చు ధనము లోభి. 47

ఆ. జల్లెడ, యవివేకి క్షుల్లకుఁడు సమంబు
గుణము విడచుచు నవగుణముఁ గొనుట;
మంచిదినుసు విడిచి మట్టి నొక్కటి పట్టు
బాగు విడిచి యొక్కఁ డోగుఁ గొనును. 48

ఆ. మద్యపాయు లందు మహిత సత్యము కల్ల,
కామి జనులయందుఁ గల్ల లజ్జ
మాంసభుక్కు లందు మహి భూతదయ కల్ల
ధనము లేని వారి పనులు కల్ల. 49

ఆ. ధనికుఁ డయ్యు దాన మును జేయ కున్నను
నధనుఁ డయ్యుఁ దపము నాచరింప
కున్న, వారి మెడకు సన్నెకంటినిఁగట్టి
ముంచ వలయు నబ్ధి మూఢ మతుల. 50

ఆ. మందుకొఱకు కాదు మాధుర్యమును లేదు
కంపు చూడ మదికి నింపు కాదు
చుట్టలు, సిగరెట్లు, ముట్టని వాఁడేడి ?
చుట్ట రోగ మట్లు చుట్టె జగము. 51

ఆ. భూమిమీద దొర్లుఁ, బొల్లు మాటలఁ బల్కు,
వికలతఁ గను, మోము విన్నఁబోవు;
సన్నిపాత మందు సమకూడు గుణములే
మద్యపాయు లందు మనుచు నుండు. 52

ఆ. ప్రాణహరణ మనెడి ప్రబల కార్యమున నీ
హస్త కౌశలమును యముఁడు గాంచి
తనకు తమ్ముఁడంచుఁ దన కార్యములను నీ
వశముఁ జేసె నతఁడు వైద్యరాజ! 53

ఆ. వెజ్జు చితిని౯ జూచి విస్మయం బందుచు
సరస౯ జూచి మదిని సణుగు కొనియె
"నేను పోయి యెఱుఁగ, నెఱుఁగడు తమ్ముండు
నిట్టి చేతిమహిమ యెవని దౌర !" 54

ఆ. మోము తమ్మిఁ బోలు, ముదముఁ గూర్చును పల్కు
కత్తెర మది, కుతుక కత్తిరించు
గోచరించు ఖలుఁడు గోముఖ వ్యాఘ్రమై
"అతి వినయము ధూర్తమతికి గుఱుతు." 55

ఆ. శునకమా ! మనమున శోకింపఁ బోకుము
"నేనె మృగము లందు నీచుఁడ" నని
నిన్ను మించి యుండె నీచు డింకొకరుఁడు
మహిఁ గృతఘ్నుఁ డతఁడు మఱచు మేలు. 56

ఆ. మనము నందు నేను మనసు నపుంసక
మనుచు భార్యఁ జూడ ననుప నదియు
మగువ యందు లగ్నమై యుండె విరహాబ్ధిఁ
ద్రోసి పాణిని నను మోసగించె. 57

ఆ. పాపమును ఋణమును బహువిధములఁ జేయ
నెంచు నరుఁడు భావి నెఱుఁగ కుండు
పరిణతి నవి మిగుల బాధను జేకూర్చు
తప్పు నప్పుఁ జేయ ముప్పు కలుగు. 58

ఆ. బలిసి యుండియు గోవు పాల నీయక వృథ
వనిత రూపముండి వంధ్య వృథయ
ప్రబలి యుండి ప్రాను ఫలము లీయక వృథ
జాతి యుండి జనుఁడు జడుఁడు వృథయ. 59

ఆ. యమున కరుదు తృప్తి యఖిల జీవులఁ జంపి
వహ్ని కరుదు తృప్తి వనులఁ గాల్చి
అబ్ధి కరుదు తృప్తి యఖిల నదులఁ బొంది
వేశ్య కరుదు తృప్తి విటులఁ బొందఁ. 60

ఆ. సకలము నొసఁగినను జామాత కాశయే
సకల భూష లొసఁగ జాయ కాశ
సకల భక్ష్యము లిడ జఠరమునకు నాశ
వీరి యాశఁ దీర్ప విధికి వశమె ? 61

ఆ. కంటకమునకు వలె ఖలునకుఁ దగు ప్రతీ
కారమిలను రెండు గతుల నుండు
ఎడమ కాల రాచి అడగ ద్రొక్కుట యొండు
దూరమునకుఁ దొలఁగఁ ద్రోయు టొండు. 62

ఆ. ఉరగ పామరులకు పరమ భేదం బుండు
పాముకంటె ఖలుఁడు పామరుండు
పాము కఱచు నరులఁ బగ పట్టి నప్పుడే
ఖలుఁ డడు గడుగునను గఱచు చుండు. 63

ఆ. సజ్జనాళి నుండి సరసోక్తులను విను
మాత్ర ఖలుఁడు కాడు మంచి వాడు
తీపి నీటి నదులు తీర మొఱసి పాఱ
నబ్ధి మధుర గుణము నందు నొక్కొ? 64

ఆ. చక్కఁ దనము కొఱకు జనుఁ డలకల మాడ్కి
ఖలుని భయముచేతఁ దలను దాల్చు
సారెకు సరిదిద్ది చక్కనొత్తినఁ గాని
కురుల మాడ్కి ఖలుఁడు కుదురు కొనఁడు. 65

ఆ. భువిని స్నేహమునను భూతి దానమునను
సంస్కరింపఁ బడియు స్వచ్ఛుఁ డయ్యు
దర్పణమ్ము వోలె తనముందు నిలబడి
యొకటి యుండఁ జూపు నొకటి ఖలుఁడు. 66

ఆ. ఖలునితోడ మైత్రి గలిగి యుండఁగ రాదు
వానితోడఁ బగయు వలను పడదు
కఱవ కున్నను శుని కాలు నాకిన మైల
కాలు కఱిచె నేని కలఁచు విషము. 67

ఆ. ఖలుఁడు శిష్టగుణముఁ గలిగి యున్నను, జీవ
మారణమున కదియుఁ గారణమ్ము
వ్యాఘ్రి ముపవసించి వ్రత విసర్జనఁ జేయ
పారణమ్ము జీవ మారణమ్ము. 68

ఆ. ఖలుఁడు చెడ్డ పనులఁ గావింప నద్దాన
దొడ్డవాని కగును చెడ్డ ఫలము
చెనఁటి రావణుండు సీతను హరియింప
సింధువునకుఁ గలిగె బంధనమ్ము. 69

ఆ. నూ ఱుపాయములను వేఱుగాఁ జేసినన్
ఖలుఁడు సజ్జనుండు కాఁడు జగతి
కస్తురిఁ గలుపుచును ఖల్వాన మర్దింప
నుల్లి పూవు కాదు మల్లెపూవు. 70

ఆ. కేశ మొకటి తెచ్చి కేదార ఘాటులోఁ
దడిపి యుంచిన నది దర్భ యగునె?
ఖలునకు సుపథమ్ము తెలుప సజ్జనుఁడౌనె?
"ఆనుకూల్య సత్య మార్య సూక్తి." 71

ఆ. పనుల వెన్ని యున్న పరపీడనము లేక
ఖలుని మదికిఁ దృప్తి కలుగఁ బోదు
తిండి తిన్నను నది పెండలో మేయక
కాకి మదికిఁ దృప్తి కలుగఁ బోదు. 72

ఆ. సుజన దుర్జన గతి సుగమమౌ రీతిని
వర్ణనమును జేసి వరుస గాను
తెలుఁగు వారి మదికిఁ దెల్లమౌ రీతిని
తెలుగు సామెతలను వెలయ జేతు. 73

దుర్జనపద్ధతి సమాప్తము.

# ద్వితీయశతకమందలి కఠినశబ్దములకు అర్థములు.

2 మృగమదము = కస్తూరి, పుష్పరసము = తేనె; 3. స్నేహసంబంధము = చెమురుతో సంయోగము, మైత్రి; దోహదము = అభివృద్ధికరమగు ప్రక్రియ; 8. సంకుచితము = ముడిగియున్నది; 11. తపనుఁడు = సూర్యుఁడు, సికత = ఇసుక, ఊష్మము = ఆవిరి, వేడి. 12 హోలికోత్సవము = హోలీ పండుగ; 16. వింతపథము = వింతమార్గము; 17. శాణము = ఇనుమును తెగగొట్టు సేనము; 18. బహుధాన్య ఖండనము = అనేక ధాన్యములను ఖండించుట, అనేకవిధములుగా పరుల కార్యమును భంగపఱచుట; 19. ద్వంద్వ దోషములు = సుఖ దుఃఖాదులు, మోక్షగామి = మోక్షమును పొందదలంచినవాఁడు. 21. వక్రమార్గము = చెడుత్రోవ. 22. సజ్జనాళి = సుజనసమూహము; 23 హలము = నాగలి, వక్రము = వంకర, వక్త్రము = ముఖము, క్షమ = భూమి, ఓర్పు; 24. సూడు = శత్రువు; 27. విశిఖము = బాణము, వ్యాలము = పాము; 29. వంశము = కులము, వెదురు, గుణము = నారి, సుగుణము; 32. చుంబలోహము = సూదంటురాయి; 34. గణుతికెక్కు = ప్రసిద్ధి చెందు, గుణి = గుణవంతుఁడు; 36. సతము = ఎల్లప్పుడు: 37. మానసము = మనస్సు. వికృతి = వికారము, కడలి = సముద్రము: 39. కఫరోగము = శ్లేష్మవ్యాధి. మధురము = తీయనిది కటువు = కఠినము, వెగటు, 43. పుష్పవితతి = పుష్ప సమూహము; 44. అంతకుఁడు = యముఁడు; అనుజుఁడు = తమ్ముఁడు; 45. వైరి = శత్రువు; 46. రాకాసి = రావణుఁడు, లుబ్ధుడు = పిశినిగొట్టు; 48 అవివేకి = మూఢుఁడు, అవగుణము = చెడుగుణము; 49. మద్యపాయి = కల్లుత్రాగువాడు, కామి = కామము కలవాడు, మాంసభుక్కు = మాంసమును తినువాడు; 50. అధనుడు = దరిద్రుడు, అబ్ధి = సముద్రము; 52 వికలత = వైకల్యము, విన్నబోవు = కాంతి విహీనమగు; 54 వెజ్జు = వైద్యుడు, సరస = దగ్గర; 55. గోముఖవ్యాఘ్రము = ఆవువన్నె పులి; 56. కృతఘ్నుడు = చేసిన మేలు మరచువాడు; 58. పరిణతి = పరిణామము; 59 వంధ్య = గొడ్రాలు, జడుఁడు = మూర్ఖుఁడు; 60. వనులు = అడవులు; 61. జామాత = అల్లుడు, జాయ = భార్య. జఠరము = కడుపు విధి = దైవము; 62 కంటకము = ముల్లు, ప్రతీకారము = పగతీర్చుకొనుట; 63. ఉరగము = పాము; 65. అలకలు, కురులు = ముంగురులు; 66, స్నేహము = మైత్రి, చమురు; భూతి = విభూతి, సంపద దర్పణము = అద్దము; 67 శుని = కుక్క; 68. జీవమారణము = జీవహింస, పారణము = వ్రత విసర్జనము; 69 సింధువు = సముద్రము. బంధనము = కట్టువడుట, 71. సుపథము = మంచిమార్గము.

# తెలుఁగు సామెతలు

## (పద్యములు)

ఆ. వ్యాజ్యెములను గెలిచి వాది వీడు వకీళ్ళ
వ్యాధి పోవ రోగి వైద్యు విడచు
దాన మొసఁగ విడచు దాసరి గృహముల
ఖలుఁడు విడుచు హితుని కాటు వేసి. 1

చెప్పునట్టి వెల్ల శ్రీరంగ నీతులు
చేయునట్టి వెల్ల చిలిపి పనులు
జరుపునట్టి వెల్ల జలనిధి స్నానముల్
దూఱునట్టి వెల్ల దొమ్మరిండ్లు. 2

అచ్చుబాటు లేని యౌపాసనముఁ జేయ
కాలె మీసకట్టు గడ్డ మెల్ల
సాటి కనుచుఁ జేయ సంగమ స్నానంబు
ముసలి మగని కాలు మొసలి పట్టె. 3

తొందర కగును మగఁ డెందు నాలస్యంబు
పుండున కగు మగఁడు పూచి పుడక
అప్పు కలుగు వాని కడుగు వాడె మగండు
త్రిప్పువాని మగఁడు తిరుగు వాఁడు. 4

ఆ. అప్పుగల్గు వాని ననుసరించితి మేని
యొప్పు చెప్పు తనదు నప్పు గొడవ
చెప్పుగల్గు వాని చెంగట నరుగంగ
ముప్పు తప్పకుండు ముండ్లఁ ద్రిప్ప. 5

శిరము నఱుక నుండఁ జెవుల పోగుల కేడ్చె
తల్లి చావ నుండ పిల్ల కేడ్చె
సిగ్గు పసిడి పోవ బొగ్గు ముక్కల కేడ్చె
విత్త మంత పోవ 'మిత్తి' కేడ్చె. 6

ఎరువు సొమ్ము మనకు బరువునకగుఁ జేటు
తీసి పెట్టు కొనఁగ తీపు చేటు
వానిలోన నొకటి పడిన నప్పుల చేటు
తెచ్చి యీయకున్నఁ దిట్ల చేటు. 7

కూరుచుండి కాలు పారఁ జాపఁగ వచ్చు
సూది దూఱ నూచఁ జొనుప వచ్చు
కొంగు దొరకఁ గోక గుంజి పట్టఁగ వచ్చు
వేలు దొరకఁ గేలు పెఱుక వచ్చు. 8

చేయి కాలు నంతఁ జేత నాకులఁ బట్టుఁ
బక్షి చేను మేయ వలలు వేయు
చేని నీరు పోవ సేతువు బంధించు
ముదిమిఁ బెండ్లి యాడు మూఢు డౌర! 9

ఆ. ఎచట లక్ష్మియుండు నచట వాగ్దేవియు
నెచట వాణి యుండు నచట లక్ష్మి
పొత్తు కలిగియుండ “రత్త కోడండ్రకుఁ
జిత్తమందుఁ బొత్తు హత్తుకొనునె ?” 10

రాగి వదలె నేని రోగమ్ము వదలును
కిలము వదలెనేని జలుబు వదలు
చిలుము వదలెనేని ఛిద్రమ్ము వదలును
ప్రాణ ముడిగె నేని పగయు వదలు. 11

“ఒక్క యొఱను బిగ్గ నొత్తిపెట్టిన రెండు
కత్తు లిమిడియుండ గలుగు టరిది”
“ఒక్క యింటిలోన నొప్పు మీరఁగ రెండు
కొప్పు లిమిడి కుదురు కొనుట అంతె.” 12

“వెనుకఁబోవు తీఁగ వ్రేళ్ళకుఁ దగిలెఁ”, దా
“నాడఁబోవు తీర్థ మాయె నెదురు”
కాఁదలచిన యట్టి ఘనకార్య సిద్ధి, కా
లస్య ముండకుంట లక్షణమ్ము. 13

ఆడుబిడ్డ పుట్టె నన నగు నొక చింత
పెండ్లి చేయు టన్న పెద్ద చింత
కన్నె సుఖము నందకున్న దన్నను చింత
కన్నె గనుట కన్నఁ గలదె చింత. ? 14

ఆ. "పల్లకోఁతి తీర్చె పిల్లి పిల్లల పోరు"
"పిట్ట పిట్టకు పగ పిల్లి తీర్చె"
"కాఁగలట్టి పనులఁ గంధర్వుఁడే తీర్చె"
"కట్టెవంకఁ దీర్చె గాడి పొయ్యి." 15

"లింగశెట్టి శేరు లింగమ్ము పదిశేర్లు
ఘనము లింగ మతని ఘనత కంటె
చద్ది యర్ధశేరు చవిగొను నొకశేరు
ఉరవు చద్దికంటె నూరఁ గాయ." 16

"ఖలుఁడు పుట్టగానె క్రౌర్యమ్ము పుట్టును
పుండు పుట్టఁ గంపు పుట్టి నట్లు
సుజను డుద్భవింప సుగుణమ్ము లుదయించు
పూవు పుట్టఁ దావి పుట్టి నట్లు." 17

"దిగు తలారి వాని పగ తల నరుకంగ"
ఖలుని పగ సుజనులఁ గలఁచి దిగును
రాచ పగ రిపులను ఊచినంతనె దిగు
"పాము పగయు దిగును పగతుఁ గఱచి." 18

"ధనముకంటె మాన ధనము మిక్కిలి ముద్దు"
వసుధ "నసలు కన్న వడ్డి ముద్దు"
"కొడుకు కంటె కొడుకు కొడుకు ముద్దగు" "తన
యాలి కంటెను వెల యాలు ముద్దు." 19

# తృతీయ శతకము

ఆ. కన్నె సంగ్రహంబు వెన్న సంగ్రహమును
పుడమిఁ జేయ భుక్తి ముక్తిఁ బడయు
ధర్మ సంగ్రహంబు ధన సంగ్రహంబును
ధరణిఁ జేయ గెలుచుఁ బరము నిహము. 20

కుట్టు నట్టి వాని కుడిచేతి ప్రక్కను
ఏడ్చునట్టి వాని కెడమ ప్రక్క
కూరుచుండఁ గుట్టుఁ గుడిచేత సూదితో
నొడలి మీద చీమ నెడమచేత. 21

తల్లి గండ ముండు బిల్ల గండంబుండు
జగతి, మధ్య మంత్రసానికేమి ?
వాది యోడఁగ ప్రతివాది గెల్వఁగవచ్చు
వాద మందు, న్యాయవాది కేమి ? 22

ఎట్లు గాలి వీచు నట్లు చాపల నెత్తు
మెట్లు నీరు పాఱు నీరు మట్లు,
ఎటులకాయు నెంత యటు గొడుగును బట్టు
మెట్లు పలుక నొప్పు నట్లు పలుకు. 23

బిందు బిందు విడఁగ బిందెలు నిండవే ?
పూల నేఱి కూర్ప మాల కాదె ?
పద్య మొక్కటొకటి పఠియింప కవి కాడె ?
ఊలు వడికి నేయ సాలు కాదె ? 24

ఆ. కూరుచుండి తిన్నఁ గొండలు తఱుగవా ?
చీమ లరుగ శిలలు జీర పడవె ?
ఊత నరుగఁ దీయ రాదె కత్తికి వాడి ?
కవితఁ జదువ, కంఠగతము గాదె ? 25

అవనిఁబడిన యాజ్య మంబ కర్పిత మంట
గాలి కెగురు పిండి కాకి కంట
మిత్తి మొత్తు బిడ్డ కత్తి పేరిడు నంట
తనకు రాని ఋణము ధర్మ మంట. 26

శత్రులేని జగము సుఖవంతమై యుండు
జనులు లేని జగము శాంతి నుండు
అత్త లేని కోడ లుత్తము రాలౌను
కోడ లుడుగు నత్త గుణము కలది. 27

అప్పు లేని గంజి దొప్పె డైనను జాలు
చొంగ లేని పాలు సోలె డైన
జడిమ లేని యాత్మజన్మఁడొక్కఁడె చాలు
మలము లేని దొక్క మణియ చాలు. 28

కొడుకు గనెద నంచుఁ గోడలు పలుకంగ
దత ్తుఁ గొనుమని యెడి యత్తగలదె ?
సిరి తనంతఁ దానె దరి చేర మోకాళ్ళ
నొడ్డి యడ్డగించు నెడ్డె కలఁదె ? 29

ఆ. కడవఁబోలు కాయ కత్తిపీటకు లొచ్చు
ప్రశ్నచేయఁ జెప్పువాఁడు లొజ్జు
బక్క చిక్కువాఁడు పదుగుఱకును లొగ్గు
నంబి కొండడన్న నాకు లోఁగు 30

విద్యవలెను గాని వేషమ్ము దేలకో?
పనులు వలెనుగాని వలువ లేల?
కర్మవలెను గాని చర్మమ్ము దేలకో?
గుణము వలెను గాని కులము దేల? 31

వియ్య మందుకొనుట కయ్యమ్ము చేయుట
నెయ్య మమరఁజేయ నియ్యకొనుట
మూటి యందును తగు సాటి కల్గఁగఁజేయు
వారి కిలను గల్గు గౌరవమ్ము. 32

పాలనిచ్చు గోవు పడఁ దన్నినను మేలు
తిట్టుచున్న మేలు, పెట్టువాఁడు.
ఆదరించువార లాడిపోసినను మే
లార్చువారె ముప్పు తీర్చువారు? 33

కుడిచినట్టి తొమ్ము గ్రుద్దంగ నగు నోటు?
తిన్నయింటి వాస మెన్నఁదగునె?
కన్న తల్లి, తండ్రి తన్ను బెంచఁగఁ, భార్యఁ
గూడి వేఱుపడుట పాడి యగునె? 34

ఆ. జ్యోతిషమ్ము, వైద్య, గీత, వాద్యములును
మంత్రశాస్త్ర మండ మనుజ తతికి
ఎఱుక చేసి యొసఁగు పరులనుండి ధనమ్ము
ఎఱుకయే సుమి, పిడికెడు ధనమ్ము. 35

కటికవాని కరుణ కాలుని కరుణయు
కనఁగ నొకటి కొకటి యెనగనుండు
అత్త మెత్తదనము కత్తి మెత్తదనమ్ము
నెత్తిచూడ నొక్క పొత్తునుండు. 36

ఇరు పగతుల మధ్య ధరణీశు గతియును
బోయ దేగల నడిఁ బులుఁగు గతియు
భార్య లిద్దఱి నడి భర్త చిక్కిన గతి
"నుయ్యి ముందు, వెనుక గొయ్యి గతియె." 37

"ఊరనున్న విబుధుఁ డుప్పు పత్రికి కాఁడు"
"పెరటి చెట్టు మందు కొరకు కాదు"
ఇంటిభార్య రంభ వంటిది సరికాదు
సులభ వస్తువులకు విలువ గలదె? 38

అప్పులీయ విత్త మవసర మగు తఱి
కందఁబోదు కష్ట మంతరింప
పున్నమ తిథినాటి వెన్నెల లమవస
కంద బోవు తిమిర మంతరింప. 39

ఆ. పూజకొలది దొరకుఁ బురుషుఁడు పడఁతికి
దానముననె బిడ్డ తనకుఁ గలుగు
తనదు కర్మముననె తనకుఁ గల్గును బుద్ధి
ఫలము దొరకుఁ దనదు భాగ్యముననె. 40

నిబిడతమము పరువ నిమ్నోన్నతము లేవి ?
ఎఱుక కలుగ తురక, మరక యేది ?
మత్తున మెయి మరువ మంచి సెబ్బర లేవి ?
"గజ్జి మేన నిండ లజ్జ యేది ?" 41

వలయు మనకు భాగ్యవంతులౌ పుత్రులు
పండితులును వీరవరులు వలదు
పండితులును వీర వరులైన పాండవు
లుండి రడవు లందు తిండి లేక. 42

అతివ, యతిథి, బాలుఁ, డల్లుండు, తమకోర్కె
తీరు నంత దనుకఁ బోరు చుందురి
నృపతి వలె నెఱుఁగక నిరుపేద యిక్కట్లు
పైక మీయ కున్నఁ బరువుఁ దీయు. 43

"అద్దెకైన గుఱ్ఱ మగడిత దాటునా ?"
"అప్పులిచ్చు విత్త మదను కగునె ?"
"సానుభూతి పరులు సహగమనము చేయు
పడఁతితోడ చితిని బడుదురొక్కొ ?" 44

ఆ. "ఊదకూడు తేని యుద్యోగ మెన్నాళ్ళు?"
"వెన్నెలలును సిరులు నెన్నినాళ్ళు?"
"వేఁగుచుక్క, మెఱుపు వెలుతురు లెన్నాళ్ళు?"
"ఎముగుట చిగిరింత కెన్నినాళ్ళు?" 45

తనకు మాన మొసఁగఁ దగు మాట మంత్రంబు
హృదయచింత మాన్ప నదియ మందు
"తా వలచిన రంభ తా మున్గు నది గంగ"
"రాజు మెచ్చు మాట రవలమూట." 46

"అక్షరమ్ము లేదు కుక్షి చీరఁగ, పట్టె
వర్ధనాలు, పట్టు వలువ లేల?"
"మ్రింగ మెతుకు లేదు మీసమ్ములకును సం
పెంగ నూనె యలది పెనుపనేల?" 47

"ఇంటి శుద్ధి తెలియు నిల్లాలిఁ జూడంగ"
పాక శుద్ధి తెలియు వస్తువరయ
"నోటి శుద్ధి తెలియు మాటాడ దొడగంగ"
"చిత్తశుద్ధి తెలియుఁ బొత్తు నరయ." 48

ఆదరింపకున్న నాదరించెడి వారిఁ
జూపి చేతనయినఁ శుభముఁగూర్చు
పెట్టకున్న నీవు పెట్టువారిని జూపు
చేయకున్నఁ జూపు చేయువారి. 49

అ. యజ్ఞమందు తక్ర మగ్ని కాహుతి కాగ
నింద్రుఁ డొసఁగకుండె నెఱిఁగి మున్ను
దాన నింద్రు న కట తక్రమబ్బదు, "మున్ను
పెట్టెనేని భువిని పుట్టు సాక్షి." 50

తల విలువను దెలుపఁ దగదు నోరిక నంచుఁ
దలలు నోరులు కడు తగవు లాడి
తల విలువను తెలుపఁదగు హక్కు తమ దంచు
నూగెఁ పాట వినుచు నూర్లు తలలు. 51

సుందరుఁ డయి గాన మందు నేర్పుగలాఁడు
ఆడువారి ముందు పాడరాదు
ఆడు దందగానిఁ బాడు వానిని గాంచి
చెడిపె యగుట శాస్త్ర సిద్ధ మిద్ది. 52

జననిఁ బోలు సుతుఁడు జనులలో ధన్యుండు
జనకుఁబోలు కన్య జగతి ధన్య
తులను బహుళవృష్టి కలిగిన ధర ధన్య
నదికి నొడ్డునఁగల నగరి ధన్య. 53

కన్యక వరియించు కమనీయ రూపమ్ము
తల్లి ధనముఁగోరు; దండ్రి విద్య;
బంధుగులును గోరు కొందురు కులమును,
వేఱు జనము కోరు విందుకుడుకు. 54

ఆ. కలశ జలముఁ గొనును గల పరిమితిఁబట్టి
కలశభవుఁడు పూర్ణ జలధిఁ ద్రాగె
తండ్రి శక్తికన్న తనయుని శక్తియే
మిన్నయౌట తండ్రి పున్నె మెన్న ! 55

అబ్ధి యుదకములను యాచింప దేవనిని
గాని, నదులు యోగ్యుఁ గాంచి వచ్చు
యోగ్యుని వరియించు భాగ్యలక్ష్మియె, గాన
పూర్ణ యోగ్యతలను బొందవలెను. 56

పశువు లఖిల మెఱుఁగు పసిపట్టు చూచియే
విబుధుఁ డఖిల మెఱుఁగు విద్యవలన
సకల మెఱుఁగు రాజు చారుల వలననే
జన మఖిలము నెఱుగు కనులవలన. 57

నరుఁడు తాను చేయు నవయత్నములఁ బట్టి
క్రిందికేని మీది కేని పోవు
మేడ కట్టువాఁడు మిగుల మీదికిఁ బోవు
నూతిఁ ద్రవ్వువాఁడు గోతి కేగు. 58

ఒప్పుతోడ మనల తప్పులఁ దెలుపుటఁ
దప్పులెన్ను వారె తనకు హితులు
తప్పుఁదాచి మనల యొప్పులఁ జూపుటఁ
నొప్పు లెన్నువార లొరులు మనకు. 59

ఆ. ముద్దుబిడ్డ ! యెవరు ముదముఁగూర్చును నీకు ?
త్వరగఁజెప్పు మనఁగఁ దండ్రి, శిశువు
తల్లివైపు మొగ్గె, తండ్రి యాసలఁ గొల్పె,
బాలుఁ డేమి చెప్ప జాలకుండె! 60

"మంచిదె మఘ పుబ్బ మాచకమ్మ సమర్త"
కిలను పుష్పముండు ఫలము లేక
మోదువు కుసుమములు పూచి రాలును భువి
ఫలము లొసఁగ లేవు వంధ్య మాడ్కి. 61

ఆఱునెలలు సాము నేరిచి శూరుండు
"మూల కూరుచున్న ముసలిఁ గొట్టె !"
గారుడమ్ము నేర్చి ఘన విష వైద్యుండు
"పాము పారిపోవ బద్దె కొట్టె !" 62

తాను శిష్యుఁ డయ్యు తనకొక్క శిష్యుఁడా ?
తాను భటుడె యయ్యు తనకు భటుడ ?
తాను తొత్తగుచును దనకొక్క తొత్తటే ?
విన్న నింతకన్న వింత కలదె ? 63

కనులు కానరావు, వినరావు చెవులకు,
నోట మాటలేదు, మోటువారు,
కాల కూటముఁ దినఁ గననగు గుణ "మన్న
కున్న గుణము లక్ష్మి కుండకున్నె ?" 64

క. నీతుల నుల్లంఘించుచు
కోతులు నాతులను గూడి కూతలు కూయన్
బూతుల చేతలు చేయఁగ
"కోతుల భాగవత" మనుచుఁ గొనియాడఁ బడున్. 65

ఆ. "మబ్బు వీడు నెండ, మగని వీడిన ముండ,"
వంపు విల్లు వీడు నంప పిండు,
"ముండ పెంచు బిడ్డ, ముగదాడు లేనెద్దు,"
సంతు లేని యింతి, చాల కరుకు. 66

జగతి గనుల బుట్టు జాతి రత్నములను
ఏఱి కూర్ప కంఠ హార మగును
జన ముఖ ఖనిఁ బుట్టు జాతీయ రత్నము
లేఱి కూర్ప సూక్తి హార మగును. 67

"కొడుకు లుద్భవింప కూటికి కరువగు"
"కూతు లుద్భవింప గుడ్డ కరువు"
కూడు గుడ్డ లెరువు కూతుండ్రుఁ గొడుకులు
తోడ తోడ బుట్ట దొడ్డ కరువు. 68

ఇచ్చు నట్టి దొక్క యీత గింజయె కాని
తాను గోరు లోభి తాటి పండు
తాను గొన్న నది యర తక్కెడయే గాని
తాన్ను కొసరును నెర తక్కెడంత. 69

ఆ. మౌన ముద్ర దాల్ప మహి కలహం బేది ?
విద్య నేర్వ మాంద్య భీతి యేది ?
తాను మేలు కొనఁగ తస్కర భయ మేది ?
మంత్ర జపము చేయ మలిన మేది ? 70

పరగణా కలుగ, నవాబు సాహేబు; తిన
మెతుకులున్న నగు నమీరు సాబు,
చీర, కూడుఁడుఁగ, ఫకీరు సాయిబు, తాను
చనిన పిదప పీరు సాహెబతఁడె. 71

బంధువయ్యు నేని వర్జించువాఁడు, తా
పంక్తికి కడనున్న భంగమేమి ?
'మార్కు' లిచ్చువాఁడు మన 'మాస్టరే' యైన
ప్రశ్న వ్రాయకున్న భంగమేమి ? 72

పుట్టి అంకున సుత పోయిన గండాన
విటుని మనసు దాని కెటుల వగచు ?
ధనము కలిగి లంచమున, రచ్చలోఁ బోవ
లంచగొండి మనసు రగులు కొనునె ? 73

ఎచటనుండి వచ్చు నెచటికి పోవునో
ధనము తెలియ బడదు ఘనము మాడ్కి
ఎటుల విఘటిత మగు నెటు సంఘటిత మౌనో
ఘనము తెలియఁబడదు ధనము మాడ్కి. 74

ఆ. ఎచటినుండి వచ్చు నెటు సమకూడునో
ఎటకు పోవునో మఱి యెటు నశించు
ధన సమాగమమ్ము ఘన సమాగమ మట్లు
ఎవడు భువిని నిజము నెఱుఁగ గలడు ? 75

రమ్యదివ్య చరిత ! లక్ష్మీసనాథ ! నా
హృదయ తల్పమందు నిదుర బొమ్ము
మనుజ ! నీదు చిత్తమణి నిమ్ము కాన్కఁగా
“లంచ మీయకున్న మంచమెక్కఁ.” 76

యూప హీనమైన ఉరుతర యాగమ్ము
దీప హీనమైన దేవపూజ
“పప్పులేని బువ్వ పరుపులేనిదె శయ్య”
యీ చతుష్టయమ్ము వృథయ పృథివి. 77

“వెన్న ముద్ద పెట్ట తిన్నగ తినలేదె ?”
“వేలుపెట్టి కరచి వేయ లేఁడె ?”
“అరటిపండు పెట్ట నారగింపఁగ లేఁడె ?”
“పైకమీయ చిక్కఁ పెట్ట లేఁడె ?” 78

వారి నిధులయందు వ్యర్థమౌ వర్షమ్ము
దివసమందు వృథయ దీపకాంతి
విందు భోజనమ్ము వృథయ తృప్తునకగు
దాన మ్మొసఁగుట వృథ ధనిక తతికి. 79

ఆ. ఉల్లి తోటలోన నుల్లాసమునఁ బాడు
కందిరీగ యౌనె కల పికమ్మ ?
సాలి దేండ్రి సభను చక్కంగ బాడు, సా
తాని యగునె పండితానుమతుఁడు ? 80

పుట్టని కొమరుఁడును, గిట్టిన సుతుఁడును
గలచుఁ దండ్రి మనసుఁ దలచినపుడె
మూఢుడైన సుతుఁడు పుట్టి గిట్టిన దాక
కలచి తండ్రి మనసుఁ దొలుచు నెపుడు. 81

వనితయుఁ గవితయు వరియింపఁ దానె యై
యుప్పతిల్లు రసము లొప్పు మీర
బలిమితోడ దానిఁ బడయ నెంచితి మేని
రసము భంగమగుచు రచ్చకెక్కు. 82

"భోగవనిత కేల బోధింప టక్కులు?"
"తాత కేల దగ్గు దగ్గ నేర్ప ?"
"ఎలుకఁ బట్టు బిల్లి కేల నేర్పఁగవలెఁ?"
"జేఁప కీదు రీతి చెప్పనేల?" 83

నీటనుండి చేఁప నీటితో వైరమ్మ
కింకరుండు దొరకుఁ జంక కుంట
కుదువపెట్టి భూమి కోపించి కొట్లాట
జుట్టు చేతికిచ్చి తిట్టి నట్లు. 84

ఆ. నూఱు రూకలీయ నూతఁబడు నెవండు ?
కూరుచున్న కొమ్మ కొట్టు నెవఁడు ?
తనదు కాళ్ళ దాళ్ళఁ దా కట్టుకొను నేఁడు ?
తనకు హానిఁ జేసి కొను నెవండు ? 85

"తోటకూర నాడె తొలగింప నైతిరా
కొడుక !" దొంగబుద్ధి కొంప తీసె
"మొక్క వంగ కున్న ముది మ్రాను వంగునా?"
చిన్ననాఁటి బుద్ధి చితిని బోవు. 86

"గురువు కూడ నొక్క గురునకు శిష్యుఁడౌఁ"
"దల్లికూడ నొక్క తల్లి బిడ్డ"
"అత్తకూడ నొక్క యత్తకుఁ గోడలౌ"
"రాజు భార్యయు నొక రాజ సుతయె." 87

క. పండగ రానై యుండఁగ
గుండెకు సందడియె మెండు కొమరులు తినగన్
తిండికి లేకయె వస్తున
పండగ గండంబె గాని పండగ యగునే ? 88

నల్లని మశియే కాళిక,
తెల్లని పత్రమ్మె లక్ష్మి, తెల్లము కాగన్
మెల్లగ 'వ్రాసెడి వర్ణము'
లెల్లను వాగ్దేవి, కోశ మిది త్రిగుణంబౌ. 89

ఆ. కనుము "మేఁకపోఁతు కలహం" బనఁగ నేమొ
తగవులాడుఁ దొలుతఁ దలలు దార్చి
ఆదియందు వృద్ధి యంతమందు హాళక్కి
యున్న, దాని మేష యుద్ధ మంద్రు. 90

"ఈన కాచి విడువ, చేను నక్కలపాలు"
"లక్షనోము లొక్క అంకు పాలు"
జీవకరుణ లెన్నొ గోవధకగు పాలు
ఎల్ల సత్యము లొక కల్ల పాలు. 91

మేఁక పోఁతు నేను మెకముల మిండడ
హాయము గజము ఖరము నశన మగునె?
సింహ మొకటిని౯దిని చేయించుకొందు నీ
బవిరి గడ్డమునకు వపన కర్మ. 92

తనదు లేమి కేడ్వ తనదొక్క కన్నూడె
పరుని కలిమి కేడ్వ బాసె నొకటి
ఈసు కలుగువా డె యీర్ష్యాళు, వాతఁడు
"రెంటికిఁ జెడినట్టి రేవ" డగును. 93

అతి సుదూర వస్తు వది కాన రాకుండు
అతి సమీపమైన నరయ రాదు.
అతి లవణ యుతమగు నది భక్షణా నర్హ
'మతి' ని విడువవలయు నన్నిచోట్ల. 94

ఆ. "తగిలిగాని దెబ్బ తాఁ దలవంచఁడు"
"తడిసిగాని తాను గుడిసె విడఁడు"
"నచ్చి గాని సరుకు మెచ్చుకోఁబోఁడు తా"
"నానుకూల్య సత్య మార్య సూక్తి." 95

అగ్గిపుల్ల కుండు నగ్రిమందునఁ దల
దాన మెదడుఁ జొనప ధాత మరచె
తన మెదడును దాన దాఁ జొనపకఁ గీయఁ
దగుల బెట్టు తన్నుఁ దనదు గృహము. 96

నీదు తల్లి, తండ్రి, నీయన్న దమ్ములు
నెల్లరుండఁ గృష్ణ ! తెల్లగాను
గోపక నిను గనుల గుప్తముగా దాచ
కజ్జలంబు తగిలి కట్టి వైతె ? 97

పిల్లి యెలుకఁ బట్టి విసరుచు నోటితో
వెనగి మరల మరల విసరు దాని
"చిన్నపిల్లి కదియె చెలగాట మగుఁగాని"
"అదియె యెలుక కగును బ్రాణహాని." 98

వసుధలోన లేదు పారమార్థిక దృష్టి
యొక్కఁ డనుకరించు నొకనిఁ జూచి
వార్ధిని యతి యిడిన వాలుకా లింగము
జను లనుకృతి సలుపఁ జనెను పాత్ర. 99

ఆ. చెడుగు నెవని కీవు చేయంగఁ దలఁతువో
చేయు మతని కెల్ల సేవ లెప్పుడు
మృగముఁ జంప నెంచి మృగయుఁడు మురళితోఁ
జేయు గానరూప సేవ నెపుడు. 100

చంపనుండి యైనఁ జనువుతో మాటాడుఁ,
జంపియైనఁ బలుకు చనువుతోడ,
శిరము నటికి యైనఁ జెలువున మాటాడు,
"మూట కరువుగాని మాట కరువె ?" 101

అతిగ దాన మొసఁగ నానాఁడు బలి చెడె
అతిగ లోభ మెంట నసురుఁ డీల్గె
అతిగ మానమెంట నాసుయోధనుఁ డోడె
'అతి' ని విడువవలయు నన్ని చోట్ల. 102

జనపతి ఘనుఁడు వలె కనకము వర్షింప
జనుల మానసములు శాంతి నొందె
నాకు జ్యేష్ఠలక్ష్మి నయమొప్ప గొడు గెత్త
బిందు వైన శిరము నందుఁ బడదు. 103

బిడ్డను వెనుఁగొంచు వెడలంగ యాత్రికు
బిడ్డఁ దేడ్చుఁ బప్పు బెల్లములకుఁ
బెనిమిటి వెనువెంటఁ బెండ్లి కేఁగ నతండు
రమ్మ రమ్మని యట రట్టుఁ జేయు. 104

ఆ. "కుమ్మరావ మందుఁ గుండ దొఱకుఁ గాని
యిత్తడి కడముంత యెట్లు దొఱకు ?"
కనుము జ్ఞానవల్లి "గంజాయి తోటలోఁ
దులసి మొక్క యచట దొఱకు నెట్లు ?" 105

ధర్మమునకుఁ బెట్టు తల్లి ! నీ మగనితో
గూడ సమముగాను జూడు నన్ను
పంక్తిభేద మెన్నఁ బరమపాతక మమ్మ !
మగని కొసఁగు దినుసు తగదె యొసఁగ ? 106

"పక్షి భాష నెఱుఁగుఁ బక్షులు" తమలోన
"నాడు దాని మాయ లాడు దెఱుఁగు"
"దొంగయెఱుఁగును గజదొంగయెవ్వఁడో", "నాగు
బాము కాళ్ళ నెఱుఁగుఁ బాము జాతి." 107

"కారణ గుణ గణము కార్య జాతమునందు
సంక్రమించు" ననుచు శాస్త్ర రీతి
నీలినూలు నేయ నీలమౌ వస్త్రమ్ము
"ఎట్టి సామెత కగు నట్టి కవిత." 108

"తిన్న కుక్క కూడు తిని పోవ నొకఁడు తా
గన్న కుక్కఁ గొట్టి కాలు విఱిచె"
"కొంటెపనులు చేయఁ గోడ, లొక్కఁడు దానిఁ
గన్న మామఁ బట్టి కాలు విఱిచె." 109

ఆ. దుగ్ధమీయ దావు దూడ డ్రాగినఁ గాని
"తెలియ దరఁటి సెల రుచి తినినఁ గాని"
చనదు నరుని జడిమ చదువుకొన్నను గాని
"తెలియఁ బోదు లోతుఁ దిగినఁ గాని." 110

దాన మొసఁగలేని ధనసంచయం బేల ?
పగతుఁ జంప లేని బల మదేల ?
ఆచరింపలేని యాగ మోక్తు లవేల ?
విషయ జయములేని వేష మేల ? 111

జాతవేద సుండు, జామాత, జఠరమ్ము,
అనుఁగు జాయయును, జలాశయమ్ము
మెండుగ నొసఁగినను నుండు దండిగ నాశ
పూర్తి, తృప్తి, పరిసమాప్తి, సున్న. 112

పాఱుచున్న వానిఁ, బూరిఁ గఱచు వానిఁ,
బుట్టి నెక్కువాని, గొట్టవలదు
శరణు వేడు వానిఁ, జరణ మంటిన వానిఁ,
గరణ ముడుగు వానిఁ, గావ వలయు. 113

ఉష్ట్రములు ఖరములు నొక సభలోఁ దాము
తమ్ముఁ బొగడు కొనియె నెమ్మి నిట్లు
"ఏమి సరసగాన ! మేమి సుందరరూప !!
మేమి మనదు భాగ్య మెన్నఁ దరమె !!!" 114

ఆ. ఇచ్చి పుచ్చుకొనుట, హెచ్చు వాదము, మిత్రు
భార్యతోడ గుహ్య భాషణమ్ము,
ఈ త్రియమును విడిచి మైత్రిఁ గాపాడుకో
నేస్తమునకు సమము నాస్తి భువిని. 115

సతము వచ్చి పోవ జరుగు లాఘవ, మతి
పరిచయమునఁ గలుగుఁ బరిభవమ్ము
మలయగిరిని భిల్ల మహిళ యన్నము వండ
చందన సమిధ లిడు నింధనముగ. 116

ఎనుము పొడుచు నను నెటి గి గుబ్బము వెన్క
కేగఁ దన్నె దెబ్బ యెదకుఁ దగిలె.
ఎండ తగులు ననుచుఁ బండ తాడికిఁ క్రింద
తాటిపండు పడియెఁ దలయుఁ బగిలె. 117

లింగధారి సొమ్ము లుంగరమ్ములఁ దాల్చి
గంగ దాటి పోవ గాంచి దొంగ
యేగ నుఱికె, లింగ మెద గ్రుచ్చుకొన, "దొంగ
బాధ కంటె లింగ బాధ మెండు." 118

ఏమిలేని యాకు లెగురుచుఁ బడుచుండు
నన్నమున్న యాకు లడఁగి యుండు
విద్య కలుగు వాఁడు వినమితుఁడై యుండు
విద్య లేని వాఁడు వెక్కుచుండు. 119

తృతీయ శతకము సమాప్తము.

# తెలుఁగు సామెతలు

## (తరువాయి భాగము)

---

### చతుర్థ శతకము

ఆ. "చెఱువు నిండెనేని చేరుఁ గప్పలు వేలు"
చెఱకు కడకుఁ జేరుఁ జీమ లెన్నొ
కాకు లరుగు నన్నకణములు చల్లంగ
"బిచ్చ మిడఁగ వేలు బిచ్చ గాండ్రు." 120

"చెప్పి పెట్టు బుద్ధి", "చిప్పఁ గట్టిన చద్ది",
"అంటు పెట్టు తోఁక", యాగఁ బోదు
"పుట్టెఁ బుట్టు బుద్ధి", "పుట్టుమచ్చల వన్నె",
"కుక్క తోఁక వంక, కుదురఁ బోదు." 121

మింగఁ గలుగు నంత మేఁత వేయఁగ వలెఁ
జేయఁ గలుగు నంత చెప్ప వలయు
ఆచరించు నంత యాన తీయఁగ వలె
మోయఁ గలుగు బరువు వేయ వలయు. 122

"తురక లేని చోట దూదేకు సయ్యాదు"
"కులట వృద్ధయైన వెలయు సాధ్వి"
"సాలెదేంద్ర సభను సాతాని యగుఁ బెద్ద"
"మాదిగలకు నొజ్జ మాలదాసు." 12

ఆ. "వంగి వాలఁడు, మఱి తొంగి చూడఁడు ఖలుఁ
డుపకృతి యనఁ బోవు నూరు విడిచి
విఱుగు వేలి మీఁద విడువఁడు మూత్రమ్ము"
స్వార్థపరుల కిదియ సహజ గుణము. 124

"కొమరుఁ డొక్కఁ డున్నఁ గొమరుఁడు కాఁడతఁ
డున్న నొక్క కన్ను కన్ను కాదు"
కొమరుఁ డొకఁడు చనిన కులము నాశన మందు
నున్న కన్ను పోవ సున్న జగము. 125

ఆది కష్ట మౌను వ్యవసాయమును జేయ,
సంసృతి సలుపంగ శ్రీమము మధ్య,
అంత్యకష్ట మౌను వ్యాపారమును జేయ,
మూఁడు వేళలందు ముప్పు లేమి. 126

"మంచి గొల్లకైన మించును కొసవెఱ్ఱి,"
మంచి కస్తురి కిల మించు నలుపు;
మంచి మనుజుఁ డైన మహిళకు లోకు, వా
"నానుకూల్య సత్య మార్య సూక్తి." 127

"కూటి కేడ్వ కడుపు, కొప్పు పువ్వుల కేడ్చె"
గారవమున "బిడ్డ గజ్జ కేడ్వ
విసిఁగి తల్లి కొట్ట వీపు దెబ్బల కేడ్చె"
శంత యేడ్చె నరువు చూచి గురుని. 128

ఆ. "బిడ్డఁ డౌను తల్లి యడ్డాలలో నుండ
గడ్డ మంకురింప బిడ్డఁ డగునె?"
ధూలి నాడు దనుక బాలిక యగుఁగాని
చంటి బిడ్డను గనఁ జంటి దగునె? 129

'అవని సురుని యింటి యరఁటి పిల్లయు, మఱి
గొల్ల పని యింటి గొఱ్ఱె పిల్ల,
ఈఁడి గతని యింటి కోడిపిల్లయు', సామి
పనుల కొఱకు తలను బలిగ నొసఁగు 130

వృత్తి నొసఁగ లేని బీదదేశము వీడు,
హాని నొసఁగు వృత్తి నరసి వీడు,
వంచకుఁ డగు మిత్రు నెంచక విడనాడు,
వీడు నిధన మొసఁగు పాడు ధనము. 131

"నీర మెఱుఁగ లేని నిమ్నభూతల మేది?
స్వామి యెఱుఁగ లేని సత్య మేది?
నక్క యెఱుఁగ లేని దొక్క బొక్కయు నేది?
నాగ మెఱుఁగ లేని లాఁగ యేది?" 132

పనుల లోన నీచ భావ ముండఁగఁ బోదు
భావ మందె నీచ భావ ముండు
ముద్దు బిడ్డ నెట్లు ముద్దాడునో తాను
ముద్దు టాలి నట్లు ముద్దుఁ గొనఁడే? 133

ఆ. మౌను లాచరించు మహిత పైతృక మందు
అల్మగల కగు పొల యలుక యందు
మేఁక పోఁతు లాడు వీఁక కొట్లాట యం
దాది ఘనతఁ జూపు మేది తుదను ? 134

నేఁటి శిశువు ముందు నాఁటి నాగరకుండు,
నేఁటి బాల ముందు నాఁటి మాత,
నేఁటి మొక్క ముందు నాఁటి భూరుహమె, యా
నాటి మొక్క గాదె నేఁటి తరువు ! 135

బిట్టుమొఱుగు శునికి రొట్టెముక్కలు దక్క
ప్రక్క నక్క దాని మెక్కు నద్ది
వామ పక్షవర్తి వలె నుండు నరునికి
నొక్క పదవి దక్క కిక్కు రనఁడు. 136

మలము మలము చేత మహిని శుద్ధం బగు
వజ్రముననె తెగును వజ్రకణిక
కంటకమ్ము కంటకము తోడ సాధ్య మౌ
ఖలుఁడు వశ్యుఁ డగును గపటముననె. 137

క. తొందర పడి పని చేయకు
ముందుగ యోచించు పనులు భువిఁ దుద ముట్టున్
తొందర పనులను జెరచును
'తొందర పడి బొందఁబడెదు' తొందర విడుమీ. 138

క. కప్పల తక్కెడ యనఁ దగు
నొప్పుగఁ గార్యముల నైక్య మొదవక యున్నన్
కప్పలఁ దక్కెడఁ దూచుచు
నొప్పుగ నొక కప్పఁ బెట్ట నొక్కటి దూకున్. 139

ఆ. "మంగలి నరు నుత్తమాంగంబు వీక్షించు,
చర్మకారుఁడు గను జరణములను"
కొజ్జ గర్భవతుల బొజ్జల వీక్షించు
మాఱు వృత్తి వలన వారి దృష్టి. 140

జాతి భేద మన్న జాతీయతకు సున్న
బ్రాహ్మణుం డటన్నఁ బదవి సున్న
హీన జాతి కన్న నీవచ్చు నెటు లన్న
విన్న నింత కన్న వింత సున్న ! 141

'కడుపుతోడ నున్న పడ తుక కన కున్నె ?'
నెలలు నిండ కున్న నిలుచుఁ గాని
"మండుకొన్న యమ్మ పస్తు పండునె ?" తన
కాక లుండ కున్న నాలసించు. 142

సాగరమ్ము లోని జల తరంగమ్ములు
వీడు టెపుడు, జలక మాడు టెపుడు ?
సంసృతి సలుపంగ శ్రమ తగ్గి, శాంతి చే
కూరు టెపుడు, గౌరిఁ గొలుచు టెపుడు ? 143

ఆ. దేని నెఱుఁగఁ గలవు దేని సాయమ్మున
నాప్త వాక్య మద్ది యాగమంబు
ఆప్త వాక్యములనె యంగీకరింపవా
ఎవరో నీకు మూల మెఱుఁగు దెట్లు ? 144

గరికను దిని నట్టి గాడిద చనెనొకో ?
గాడిద తిని నట్టి గరిక చనెనొ ?
భూమి నాదటన్న పురుషుఁడు చనెనొకో ?
పురుషు డనుభవించు భూమి చనెనొ ? 145

పొట్టఁ జేతఁ బట్టి గుట్ట లన్నియు మెట్టి
యుట్టి నురిని బెట్ట నన్న దిట్ట !
"నారు బోయు రైతు నీరు బోయక యున్నె"
యా (నుకూల్య సత్య) మార్య సూక్తి. 146

విషయ వాసనలను విడనాడుమని బుద్ధి
చెప్పఁ; దాని గూడఁ జెఱచె మనసు,
"ఉపకృతి కని పోవ నపకార మెదురగు"
నా (ను కూల్య సత్య) మార్య సూక్తి. 147

క. "కందము వ్రాసిన కవి యఁట,
పందిని వేఁటాడ మేటి బంటఁట" యౌరా !
అందఱి నంత శ్శత్రులఁ
జిందఱగ జయింప విశ్వజేతయుఁ గవియా. 148

ఆ. ఖలుఁడు తనకు మేలుఁ గలుగఁ జేసెకి స్నేహి
తులకె చెడుగుఁ జేయఁ దొడఁగు మహిని,
పాలుబోయఁ గఱచుఁ బాము పాలకులనె,
"ముద్దు బెట్టఁ గుక్క మూతి కఱచె" 149

ఎంత హేయమైన నింద్రియ లోలుండు
మలములోని క్రిముల మాడ్కిఁ బరఁగు
"ఎవరి కంపు వారి కెంత్రైన నింపగున్
బరుల కంపు తనకుఁ బాడు కంపు." 150

రామ భక్తులందు రామభద్రుఁడు పేరు
వీర శైవులందు వీర భద్రుఁ
డిట్లు తప్పఁ దిరుగు నిలను సోమరిపోతు
"దున్న దూడ లందు నెన్న నెక్క" 151

శాంతి దయయుఁ గల్గు సాధులఁ బూజింప,
రన్నిచోట్ల ఖలున కర్చ జరుగు
నావుఁ గరిని గరుడు నడుగఁ డెవ్వండును !
సర్పపూజ జరుగు చౌతినాడు. 152

దేవు డొసగు సర్వ దేహేంద్రియాదుల
దేవున కొసఁగంగ దివ్యతపము
"మాది మాకు నొసఁగ మడి మాన్య మొసఁగుటే"
స్వీయ విత్త మేమి చేర్చు కున్న. 153

ఆ. దేవుఁ డుండఁ దనదు దేహమందిర మందుఁ
దీర్ఘయాత్ర కేగు దేవుఁ గాంచ
"బిడ్డఁ జంకఁ బెట్టి వెలఁది వెదకిన రీతి"
నా (నుకూల్య సత్య) మార్యసూక్తి. 154

సంధ్యఁ జేయ కున్న సత్రయాగము లెట్లు ?
సిద్ధజలము లేక సేద్య మెట్లు ?
పతికి సేవలేక సతి పతివ్రిత యెట్లు ?
"చాలఁ డుట్టి కెక్క స్వర్గ మెట్లు ?" 155

గురుని కరుణలేక కుదురదు జ్ఞానంబు
వహ్ని లేక కాదు వంటకంబు
"శివుని యాజ్ఞలేక చీమయుఁ గుట్టదు
ఆ(నుకూల్య సత్య) మార్య సూక్తి. 156

పరభృతాదు లేడుఁ బంచమాదులఁ బాడు
భారతీయ మునులు ప్రణవ రతులు
శారికా శుకములు సరస గీతికఁ బాడు
"నెట్టి గూటి చిలుక కట్టి పలుకు." 157

తాను చెడ్డ నరుఁరు తన తోడి వారిని
గూడఁ దన్నుమాడ్కిఁ గోరుఁ జెఱుపఁ
"దాను చెడ్డ కోఁతి తగ వనమెల్లను
జెఱుపఁ జూచు" గాదె ! సిద్ధసూక్తి. 158

ఆ. గ్రుడ్డి దైన ప్రేమ చెడ్డదై దటిఁ జేరు
మనుజుఁ గ్రుడ్డిఁ జేసి మరులు గొలుపు
"అమ్మ పెట్టునట్టి యమృతంపు చవికంటె
నాలుపెట్టు బలుసు మేలు" గాదె ! 159

వస్త్ర, వాస్తు, కల్ప, పాత్రల సమగూర్చి
బంధు భృత్య గౌరవంబుఁ జేసి
క్షుధయు నిదుర మాని క్షోభ నొందఁగవలెఁ
"పెండ్లిఁజేసి యిల్లు వేసి చూడు." 160

ఆజ్ఞదాఁటు వాని కపరాధ మను శిక్ష
హత్యఁజేయ ప్రాణ హత్య శిక్ష
యజ్ఞకర్మలందు నధిక హోమము శిక్ష
"యెట్టి తప్పుఁజేయఁ నట్టి శిక్ష." 161

సూర్య చంద్రులు జత; సుఖ దుఃఖములు జంట,
జనన మరణ యుగము సహచరంబు,
"కలిమి లేములు జత కావడికుండలు"
నుష్ణ శీత యుగళ మొక్క జోడు. 162

ఆత్మబంధ ముక్తి కనువైన మార్గంబు
వీడి పరుల పనుల వెంటఁ దవుల
"నింట గొడ్డుగేదె యిరుగింట పతలక్ష్మి"
యా(నుకూల్య సత్య) మార్య సూక్తి. 163

ఆ. జగములందు సకల జనులను సృష్టించి
భక్షణంబుఁ జేసి రక్షఁ జేయఁ
జిన్న పెద్ద పనుల శ్రీమాతయే పెద్ద
"యౌను కాదనుటకు నత్త పెద్ద." 164

శంకరుండు సుధను సరిపోలి యుండును
పసుపురంగుఁ బోలుఁ బరమ సతియు
వీరు కలియఁ బుట్టె విఘ్నేశుఁ డెఱ్ఱనై
పసుపు సుధయుఁ గలుప వన్నె యెఱుపు. 165

తల్లి దండ్రి గండతలమును ముద్దాడు
చుండ గజముఖుండు చూచి వారి
మోములఁ గలుపంగ ముదమంది తనదు గం
డస్థలమును దివిసి టక్కుఁ జేసె. 166

గ్రుడ్డివారికెల్ల గురుఁడు మెల్లఁగలాఁడు
బుధులు లేని చోట మూఢుఁ డొజ్జ
"మ్రానులేని యిసుక మైదానముల యందు
నాముదంపు తరువె యమర తరువు." 167

ఆఁడువారి చేతి యర్థంబు, మగవారి
చేతఁ బెఱుఁగు చిన్న శిశువు తనువు,
గొఱియ తోఁక; భ్రూలఁ గొమరారు రోమముల్,
పెరుఁగ వెన్ని యేండ్లు వెనుకఁ బడిన. 168

ఆ. విధిగఁ బంపు ధనము వేఱు దేశము లందు
మన సుతులకు దొఱకు మాడ్కి మహిని
విధియుతముగ నిచ్చు వివిధ దానములును
విబుధ లోకమందు విధిగ దొఱకు. 169

రత్న పీఠమందు లలిత కూర్చుండంగ
సేవఁజేసి సురలు సిద్ధరూప
ములను గోళ్ళఁ గోట్ల కొలదిగఁ జూచిరి
కాళి "కాలిగోటిఁ బోలు నెవఁడు ?" 170

చదువు సంధ్య లేక జపతపంబులు లేక
దేవపూజ లేక తిరుగు కంటె
కొంతయైన భక్తి కుదిరి యుండుట మేలు
"గ్రుడ్డి కన్న మెల్ల కొంత మేలు." 171

జ్ఞాని యెపుడు బ్రహ్మ మౌని యై ధ్యానించి
యాత్మ యందె మగ్నుఁ డగుచు నుండు
అనుభవంబు లేని యజ్ఞాని వాదించు
"వట్టి గొడ్డు కెక్కు వగునఁ టార్పు." 172

శంకరగురుఁ డన్ని శాస్త్రముల్ పఠియించి
చిన్న వయసు నందె సిద్ధుఁ డయ్యె
ఉపనిషత్తు లన్ని యుపదేశ మొనరించె
"శంకరుఁ డన నపర శంకరుండె !" 173

ఆ. ఉత్తరుండు పూర్వ ముత్తమాటలఁ బల్క
నాల మందలైన నదల కుండె
పార్థు సన్నిధి నతి పౌరుషోక్తులవేల ?
"పిన్ననోట నేల పెద్ద యఱుపు ?" 174

ధరను హంస పక్షి దహర గగనవాసి
నలు పలుకులు పుట్టె నందు నుండి
వైఖరీ నినదమె పరఁగెను జగమెల్ల
కూయు "పిట్ట చిన్న కూఁత ఘనము." 175

శాబ్దబోధ తనను శక్త్యను సారంబు
మర్త్యదేహ మంబు మానసమము
సర్వ వస్తుసార మూర్వీగుణానుగ
"మెంత చెట్టున కగు నంత గాలి." 176

కళలు లలిత చిత్ర, కావ్య, సంగీతముల్.
ప్రతిమఁ జేయఁ, గవిత వ్రాయఁ, బాడఁ,
బుట్టె, నట్టి వానిఁ బొట్టకై సరిపెట్ట
"వెఱ్ఱివాని చేతి విలువ ఱాయి." 177

మౌంజిబంధ మందు మాతృ వందన ముండుఁ
జరణ మంటుఁ బెండ్లి సప్తపదిని
జరుపు యతియు మాతృ చరణ వందనమును
"సతుఁ కెవఁడు పూజ సలుప కుండు ?" 178

ఆ. సత్తిపూజఁ జేసి ముత్తెంపు హారతు
లెత్తి బత్తి దత్తచిత్తు లగుచు
ముత్తయిదుకుఁ జిత్తవిత్త మొసఁగి సాఁగి
పడుదు "రడుగులకును మడుఁగు లొత్తి." 179

దేశికుండు బ్రహ్మఁ దెలుపంగ శిష్యుఁడ
ద్వైత శాస్త్రజలధిఁ బారమందు
భేద ముండు నందు స్వీయానుభూతిని
"గనుల చెవుల మధ్యఁ గలదు దవ్వు." 180

బ్రహ్మసత్య మనుచుఁ బరమ విజ్ఞానంబు
కలుగ విడువ వలెను గర్మలెల్ల
యజ్ఞకర్మ చిహ్న యజ్ఞోపవీతంబు
"జగము నెఱుఁగ; నేల జన్నిదంబు.?" 181

గురులు కోట్లు గలరు, పరదేవతాఖ్యలు
గలవు వేలు. జిహ్వకలదు నోట
బద్ధజీవి దుఃఖవార్ధి మగ్నుండౌట
"కలిగియుండి లేని కర్మమయ్యె." 182

పరమ పదము నొంద బంధువర్గము చనెన్
వయసు చాలఁగడచె వచ్చు మిత్తి
చిన్మయంపు దీపశిఖయందు శివు మ్రొక్కి
"చక్కి దీపముండఁ జక్కఁ బడుము." 183

ఆ. స్వానుభూతిలేని శాస్త్రమ్ము చర్చకా
లోభిధనము చోర లాభమునకు
గొడ్డుగేదె యన్ని గడ్డివాములు మేయ
"శుంఠ శిష్య విద్య కంఠశోష." 184

భావరత్నమాల వరహృదబ్ధిని బుట్టి
యహమహమిక తోడ నాడు నోట
కావ్య పుష్పమాల గ్రథనఁ జేసెడివేళ
నానుకూల్య సత్య మార్యసూక్తి. 185

కాలకూట విషము గళము నిండఁగఁద్రావి
బ్రతికియుండె నెట్లు పరమ శివుఁడు ?
అంబ ! యమృతవల్లి వర్ధాంగమందుండ
నా "విషంబుఁద్రావఁ బ్రాణిపోదు !" 186

ఉపనయనము గురువు త్రిపదయు లేకుండ
బ్రహ్మవేత్త యనుచుఁ బఱఁగెఁ బేరు
"ఆలులేదు చూలు నాదినే లేకుండె
సోమలింగ మిడిరి సుతుని పేరు !" 187

ఆదిభిక్షు వయ్యు నాశాంబరుం డయ్యు
వసతి పితృవనంబు విసముఁ దినియు
సతినిఁ జెట్టపట్టి జగదీశ్వరుం డయ్యె
"ధన నదృష్ట మాఁడు దాని దౌర !" 188

ఆ. ధర్మ సత్య కరుణ దానాది గుణములు
గల్గు వారిసంఖ్య గగన మయ్యె
జగతి భక్తిలేని జనులఁ జూడఁగ లేక
"కన్నుఁ బొడుచుకొన్న నున్నె ? ఫలము ?" 189

ప్రౌఢసరస మధుర భక్తిసంయుత కావ్య
కన్యలేని ముఖము వన్యభూమి
దైవభక్తి లతిక తనరని మది రాయి
"పిల్లలేని యిల్లు భిక్షు మఠము," 190

మహిని 'దేహి' యనక మాత పెట్టదు భిక్ష,
కోరకుండ నీఁడు గురుఁడు నెఱుక,
శ్రీయు నడుగకుండ సిరిసంపదల నీయ,
"దమ్మ పెట్ట దన్న మడుగ కున్న." 191

దైవమిచ్చు ధనముఁ దానుభుజింపఁడు
పరుల కిచ్చి సాయ పడఁడు లోభి,
"కనుము కుక్క నిండుకాసారమున నుండి
జలము నాకుఁ ద్రావఁ జాలకుండు." 192

చెడుగుఁ జేయనేల ? చెంపలేయఁగనేల ?
తప్పుచేసి తదనుతాపమేల ?
కాలఁ దన్న నేల ? కాళ్ళపైఁబడ నేల ?
"యడుసుఁ ద్రొక్కి కాలు కడుగనేల ?" 193

ఆ. ముఖ్యమైన యంగముండక పనికాదు,
గౌణ మొండులేక కడచుఁ బనులు,
"కన్నె లేకయున్న కాదు పెండిలి, సన్నె
కల్లుదాఁచఁ బెండ్లి కాక యున్నె ?" 194

"పత్రి శివునిమీఁద భక్తి చెప్పులమీఁద,
మాల చేతిమీఁద, మనసు మరుల
మనువు జిహ్వామీఁద, మాట లొట్టలమీఁద,
నిట్టులున్నఁ గలుగు నెట్లు ఫలము ?" 195

"పస్తు పడుటకంటె పచ్చి పులుసు మేలు,
గొడ్డు కంటె దత్తు కొడుకుమేలు,
మేలు గ్రుడ్డికంటె మెల్ల యైనను, లేని
బావకంటె గ్రుడ్డిబావ మేలు." 196

"శాకటాయన మను సంబంధ" మొకటియు
"బాదరాయణ మను బాంధవమ్ము"
శకట, బదర, యుగళ సంబంధమున నొప్పుఁ
జుట్టఱికము లేక చుట్ట మనుట. 197

అంధుఁ డయ్యె నాహ్వా నంబుజ నేత్రుండు,
భిక్షు వయ్యెఁ దాఁగుబేరుఁడాఖ్య,
"నింట గబ్బుకంపు నిలుపేరు కస్తూరి,
పేరు పెద్దదయ్య నూరు దిబ్బ." 198

ఆ. "అంద జుట్టుఁ బట్టు నందకుండినఁ గాళ్ళు,
సంక దుడ్డుఁ గలిగి శరణు వేఁడు"
గడ్డ మంటి గళము గడ్డపాఱల నేయు
ఖలుఁడిల నగును బలు తలలఁ జిలువ. 199

ఇంద్రియముల గెల్చి, యీషణముల వీడి,
గెలిచి లోని యరుల, గెలువు పరము,
ఇంటిలోఁ బదుగుఱ కేకవాక్యతఁ గూర్చి,
"గెలిచి యింట రచ్చ గెలువవలెను." 200

"కట్టుపోతు నోరు, కత్తి కల్గిన చేయి,
తిరుగ మరగు కాలు, తిట్టు నోరు"
పెట్టనేర్చు చేయి, వట్టిగ నుండునా ?
"యానుకూల్య సత్య" మార్యసూక్తి. 201

మఱియుఁ గోఁతి జాతి కుతుక దనుక కల్లు
నతిగఁ ద్రావ మతియు గతియుఁ దప్పె,
భూత పతియుఁ దాకెఁ, జేతఁ గుట్టెను దేలు,
దాని గతి నుతింపఁ దాత తరమె ! 202

ద్యూతమైథునములు, నుద్యోగ భోగముల్
వ్యయము, మదిర, మృగయ, పాడి, పంట,
పగయు, నిదుర, దురద, పరవనితా వాంఛ
"యెంత సేవఁ జేయ నంత పెరుఁగు." 203

ఆ. ఏదియొ తరుమూల మేదేని రసముతో
నూటి మాత్రఁజేసి యే రుజలకొ
యొసఁగి చూడు రోగ మెసఁగునో కసుగునో
"యున్న దున్న రీతి నుండఁబోదు." 204

"కన్నగాఁడు కత్తి కానకుండునె ? కన్న
పెట్ట" నైన వెట్టి పట్టు వాని
"నూఱు గొడ్లఁ దిన్న నొక్క రాబందును
బిట్టు గాలిపెట్టు మట్టుపెట్టు !" 205

"ఉర్వరావని కృషి నుండదు దుర్భిక్ష"
మని పదుగుఱి తోడ మనఁగ నేను
"వలనఁ బంచమి యని వ్యవసాయమును జేయ
కంటెఁ బంచ మయ్యెఁ గామ శాస్త్రి !" 206

"నాఁతి చుట్ట మూడ్చు నట్టింటఁ బాదుకల్,
పతికిఁ జుట్ట మూడ్చు బయట గదిని"
ఆలు మగ లెఱుఁగక నాషాఢ భూతియు
విడిసి దేవు నొద్దఁ గుడిచె మనువు ! 207

వర్ణ మున్న శిల్పి ప్రతిమఁ జిత్రించు, సు
వర్ణ మున్న భూష స్వర్ణహారి,
వర్ణ మున్నఁ గవియు వరకావ్యము రచించు,
హేయ మౌను వర్ణహీన ధరణి. 208

ఆ. పిటికి వాని చేతి భీమరాయుధంబును,
వాగ్విభూతి లేని వక్త విద్య,
అరయ లోభిధనము, నను నీతఱియంబును
డాంబికమ్ము జనవిడంబనమ్ము. 209

పదులు ఖర్చుఁజేసి పదునొకంటికి జంక
"లోభి కగును ఖర్చు రూక లెన్నొ!"
అన్ని పనుల లోన నంతంత విడనాడ
"నెబ్బె రాసికి బసులెక్కు" డుర్వి. 210

తండ్రినాఁడు కలదు తగునంత వైభవ
మేపులేక సుతుఁడుఁ జూపు మెఱుపు,
పుడమి "చింతచావ పులుపు చావక యుండు"
నా(నుకూల్య సత్య) మార్యసూక్తి. 211

ఆత్మమాధురిరుచి నానుచు సద్యోగి
తను, మన, ధనముల ధారపోయు
మధురరసముఁ గ్రోలి మత్తిల్లి స్పృహఁదప్పి
వరపిపీలిక, తనుబలిని మాడ్కి. 212

"పైఁడి కంచమైన గోడ యాశ్రయ మింత
లేక నిలువలేము" లేశమైన
"నరపతిసుతయైన సురతమ్ము లేకుండ
సుతునిఁ గనఁగఁబోదు" సుజనసూక్తి. 213

ఆ. నలుని పాకమైన నిల లవణములేక
రుచులు బయట పడవు పచన మైన
"వెన్నపూసఁ దీయ వేలు వంపక" పెర్వు
కడవనుండి బయట పడదు వెన్న. 214

వాత పిత్త యుగము బాధించు రోగిని
నొకటి హెచ్చి మఱియు నొకటి తగ్గి
తమ కనుగుణముగను దమవైపునకు లాగు,
"నిద్దఱాండ్రు మగని నీడ్చు కరణి." 215

చిన్నకార్యమైన నన్ని సాధనముల
నిల నెలకొని సలుపు నేర్పు తోడ
"పిల్లపామునైన బెద్దకఱ్ఱలఁ జేతఁ
గొనుచుఁ గొట్టవలెను" గుఱుతుమీఱ. 216

ఖలునియందు గుప్తి, జలమందుఁ దైలంబు,
ప్రాజ్ఞునందు విద్య, వనుల వహ్ని,
నలు కెలంకులకును దలమునం బఱఁగును
"స్థాన బలిమి కాని తనదికాదు." 217

విత్తు మంచిదైన పెఱుఁగు మంచిఫలంబు,
తల్లి మంచిదైనఁ దనయ మంచి,
శ్రద్ధ మంచిదైన సాధ్యమౌ కార్యంబు,
"నోరు మంచిదైన నూరు మంచి." 218

ఆ. "సంకు లోని నీరు శంఖతీర్థం బగు,
పెంకులోని నీరు పెండనీరు"
పఱఁగు నాశ్రియమున గురుతయు లఘుతయుఁ
"దనకులేని మహిమ తావుమహిమ." 219

బీదవారి రక్త మేదస్సులను బీల్చు
వానికేమి యెఱుక వారి గోడు;
వైద్యుఁడెఱుగునె ! పెఱవారి గాయఁపు నొప్పి;
"యెద్దుపుండు కాకికేమి నొప్పి ?" 220

విలువ తక్కువైన వెలవెల నగు వస్తు
విల వెలపెరుఁగ మిలమిలన మెఱయు
"ఓలి తక్కువైన నాలి గ్రుడ్డికిఁ దోఁడు
పూఁట కొక్క కుండ బీఁట వాచ్చు." 221

బురద పామెయైన బుస్సకొట్టఁగ వలెన్
గరళముండ దనుచు నెఱుఁగు నెవఁడు ?
పౌరుష విరహితుని భయపెట్టు నల్పుఁడున్
"కట్టలేని వాని గొఱ్ఱె కఱచె." 222

చిన్నముల్లు తగిలి చిఱుత గాయముఁ గల్గి
పెచ్చుకట్టి మానఁ బీఁకి కోఁతి
గోళ్ళఁ, గాళ్ళఁ వేళ్ళ, గోఁకి పెద్దగఁజేయు
"కోఁతిపుండు బ్రహ్మజాతి యసుర." 323

ఆ. దైవమునకు మంత్రి దక్షిణ లర్పింప
వచ్చి దేవుఁ డొసఁగు వరము మనకుఁ
"బైసఁ జూపఁ గొండపైనుండి దిగుఁ గోఁతి
లంచ మీయఁ బ్రభువు మంచె దిగును." 224

(వైరాగ్య పద్ధతి)

ఆ. ఏడుకోట్ల మనువు లేకాగ్రతకు భంగ
కారకములు, వాని సారమెల్ల
నిమిడి యుండు నొక్క హ్రీంకార బీజాన
విత్తనంబున పెను వృక్షమట్లు. 225

విఫలము లగు నితర బీజాల కంటె, హ్రీం
బీజమొకటి చాల విలువ కలది
విలువలేని వేనవేలు విత్తులకంటె
కల్పబీజమొకటి ఘనము కాదె ? 226

శ్రవణహీనమైన సర్పమ్ము శంకరా
భరణము వినుచుఁ బరవశము నొందు
శ్రవణ సహితుఁడైన జనుఁ డది వినకుండుఁ
జెప్పు మేమిఫలము చెవులు కలిగి ? 227

జిహ్వాకలదు నోట చిన్మయాఖ్యలు వేలు
కలవు, పలుకకుండు ఖలుఁడు వాని,
వ్యర్థమౌ పలుకులఁ బలుకును వేసార్లు
వాని కర్మమునకు బాధ్యులెవరు ? 228

ఆ. నామ మొక్కఁడేని నామ సాహస్రిన
కీర్తనమును జేయ గేలికైన
పర్వత సమమైన పాపరాశి దహించు
తూలరాశి నగ్ని కీల యట్లు. 229

విహితకర్మ లుడిగి విధినిషిద్ధములగు
కర్మ లాచరింపఁ గలియుగాన
నెట్టి పాపసంఘ మేర్పడునది, యుమా
నామకీర్తనమున నాశమందు. 230

ఎవఁడు భక్తితోడ నీ నామసాహస్ర
మెపుడును బఠియించి జపముఁజేయు
నట్టి భక్తవరున కఖిల వాంఛితముల
రాజ్యవిభవములను లలిత ! యొసఁగు. 231

నాకసుఖము నొసఁగు నామ సాహస్రమ్ము
వీడి సిద్ధిఁబడయ వేడు నెవడు
అశనము విడనాడి ఆఁకలి నిర్జింప
నెంచు నతని మూఢుఁడంచు నెంచు. 232

నరు డెవండు నీదు నామ సాహస్రమ్ము
విడిచి తృప్తి పరుప వేఁడు నిన్నుఁ
గనులు మూసికొనుచు కాళి ! నీ రూపమ్ముఁ
జూడనెంచు పరమ మూఢుఁడతఁడు. 233

ఆ. నామకీర్తన విడ నాడి యే మనుజుండు
పాపహాని కొఱకుఁ బాటుపడునొ
అగ్నిసేవ వీడి యా హిమగిరిని సే
వించు మూఢుఁడంచు నెంచుమతని. 234

కలుష బహుళమైన కలియుగమందు నా
చార హీనుల, దరిఁ జేర్ప నీదు
నామకీర్తన విడనాడి వేఱొక ధర్మ
మిలను గలదె? భక్త సులభపథము! 235

పాప సంఘములను బాఱఁదోలఁగ నొక్క
మంత్రమునకు నెంత మహిమ కలదొ
అంత పాపచయము నఖిల లోకమ్ములు
నేకమైనఁ జేయ లేకపోవు. 236

అనుదినమును నామమును గీర్తనముఁ జేయ
శక్తి చాలకున్న జనుఁడు, పంచ
పర్వ దినములందొ భక్తి కలిగిననాఁడొ
సలుప నామజపము చాలు నదియె, 237

మంత్ర జపము తపము మానివేసినఁ గాని
పూజనమును విడిచి పుచ్చి గాని
నామ కీర్తనమును నమ్మి చేసినఁ జాలు
వాని కొసఁగు లలిత వాంఛితములు. 238

ఆ. జన్మకోటులందు జనుఁడెవం డన్య దే
వతల నామ జపము భక్తిఁ జేయు
వానికే కలుగును పరమేశ్వరీ నామ
కీర్తనమున భక్తి పూర్తి గాను. 239

ఏ జననము నందు నెవఁడు శ్రీమాతను
నర్చచేసి నామ చర్చఁ జేయు
ఆ జననము నందె యతఁడు ముక్తినిఁబొందు
నదియె చరమజన్మ మంచు నెంచు. 240

దేహ మనఁగఁ జెల్లు దేవాలయం బన
జీవుఁడనఁగఁ జెల్లు దేవుడనఁగ
అజ్ఞత నగు కర్మ లౌను నిర్మాల్యంబు
సోహ మనెడి భక్తి చూపు ముక్తి. 241

దేవి ! యిచట నున్న నీ వాఁడనే నేను
అచట నున్న నీవు నగుదు వట్లె,
తనులు కలియకున్న ధరణి నయ్యెడి దేమి !
సంగమంబు హృదయ సంగమంబె. 242

ఆశిషమ్ము వరము నను నీ ద్వయమ్మునఁ
బ్రబల మాశిషమ్ము వరము కంటె
ఆశిషమ్ము లొసఁగు నాదరమున నొజ్జ
వరము నొసఁగు దేవి బలిమి వేఁడ. 243

ఆ. కోశములను జూచి కుమతి మంత్రము నేర్వ
గురుని ముద్ర లేక పరము సున్న
నోటుఁ జూచి క్రొత్త నోటును సృష్టింపఁ
బ్రభుని ముద్రలేక ఫలము సున్న. 244

మంత్రజపము నెఱుఁగ యంత్రాదు లెఱుఁగ, నీ
స్తోత్ర మెఱుఁగ, దేహ యాత్ర నడుపు
భవ్య చరణసేవ భవదుఃఖహర మని
మాత్ర మెఱుఁగు దాది సూత్ర మదియ 245

తల్లి ! నీకుఁ గలరు తనయులెందఱొ బుధుల్
వారిలోన నేను పామరుండ
దుండగీఁడును కడు దుష్టుఁడౌ పుత్రుని
ఘాతచేయు మాతృ నీతిగలదె ! 246

అర్థలోభముననొ యలసత వలననో
విధులఁ దెలియఁదగిన వీలులేకొ
చరణసేవఁ దప్పి శరణన్న పుత్రుని
ఘాతచేయు మాతృ నీతి కలదె ! 247

ఏ కులజుఁడుగాని ఏ జాతివాఁడేని
మంత్రవర్ణము విన మఱిగె నేని
ధనికుఁడు, సుకవియును ధరణీశుఁడగును, నీ
మంత్రజపముఁ జేయు మహిమ యెంతొ ! 248

ఆ. కాచలబ్ధికొఱకు నీచమానవులను
కొలిచి లలిత ! నిన్నుఁ గొలువనైతి
అఱువదేండ్లు గడచె నంత్యకాలమున నీ
చరణసేవ కన్న శరణ మేది ? 249

భస్మము మెయి పూఁతఁ పాములు తొడవులు,
గరళ మశనము, పెనుకాట నునికి
పునుక దాల్పు, శివుఁడు భువనేశుఁడౌట, యా
లలితఁ బెండ్లియాడు ఫలము గాదె ! 250

మోక్ష కాంక్ష లేదు మోహనాంగులఁగూడు
కాంక్షలేదు, విత్త కాంక్ష లేదు
కాంక్ష లుడిగెఁ గాని కలదొక్క కాంక్ష; నీ
మంత్ర జపము తోడ మనుచు నుంట. 251

ఎవరి సంస్మరింప నెవరి నామముఁ బల్కఁ
బుణ్య కర్మలందుఁ బూజ లందుఁ
గర్మ లోప మెల్లఁ గడచి పూర్ణత నొందు
నట్టి లలితకు నతు లర్పితములు. 252

శ్లో. "ఆర్యోక్తి సప్తశత్యాం" తు
పద్యానాంతు చతుశ్శతం,
అర్పితం లలితా దేవ్యై
"సత్యనారాయణేన" సత్॥ 253

(శ్రీ లలితా త్రిపురసుందరీ సుప్రీతా భవతు)

# తెలుఁగు సామెతలు

## ద్వితీయశతకమందలి కఠినశబ్దములకు అర్థములు.

2. జలనిధి = సముద్రము; 9. సేతువు = కట్ట; 10. వాగ్దేవి = సరస్వతి; హత్తుకొను = కలసియుండు; 11. ఛిద్రము = రంధ్రము; 16 ఘనము = గొప్పది, ఘనత = గొప్పతనము. ఉరవు = అధికము; 18. రిపులు, పగతురు = శత్రువులు. 20. సంగ్రహము = జాగ్రతపరచుట;

## తృతీయ శతకమందలి కఠినశబ్దములకు అర్థములు.

25. కంఠగతము = ముఖపాఠము; 26. క్షుత్తు = ఆకలి; 28. జడిమ = మాంద్యము, ఆత్మజన్ముఁడు = కుమారుఁడు; 35. అండ = ఆధారము; 39. తిమిరము = చీకటి; 41. నిబిడతమము = దట్టమైన చీఁకటి, విమోన్నతములు = మెరక పల్లములు; 44. సానుభూతిపరులు = సమానమైన అనుభవముకలవారు; 50. తక్రము = మజ్జిగ; 53. తుల = తులాసంక్రమణము; 54. కమనీయరూపము = సుందరరూపము; 55. కలశభవుఁడు = అగస్త్యుఁడు; 56. యోగ్యత = అర్హత; 61. వంధ్య = గొడ్రాలు; 62 గారుడము = విషమంత్రము; 67 జనముఖఖని = జనుల ముఖమనెడి గని, సూక్తిహారము = ఆర్యోక్తులను మాల; 70. మౌనముద్ర = మౌనమును వహించుట. మాంద్యభీతి = అజ్ఞానభయము, మలినము = పాపము; 74. ఘనము = మేఘము, విఘటితమగు = విడిపోవు. సంఘటితమగు = సమకూడు; 75. ధనసమాగము = ధనమువచ్చుట. ఘనసమాగమము = మేఘములరాక; 76. తల్పము = శయ్య; 77. ఉరుతరయాగము = గొప్పయజ్ఞము; 79. వారినిధులు = సముద్రములు, తృపుఁడు = తృప్తిపొందినవాఁడు, ధనికతతి = ధనికవర్గము; 83. భోగవనిత = వెలయాలు; 89. కోశము = పుస్తకము, త్రిగుణము = త్రిగుణాత్మకము; 90. మేషయుద్ధము = మేఁకపోఁతుల కయ్యము; 92. వపనకర్మ = క్షౌరము; 94. భక్షణానర్హము = తినుటకు వీలులేనిది, అతి = ఆధిక్యము; 99 వార్ధి = సముద్రము, వాలుకాలింగము = ఇసుకముద్ద; 100. మృగయుఁడు = వేటకాఁడు; 105. జ్ఞానవల్లి = గంజాయిపత్రి 110. దుగ్ధము = పాలు; 111. ధనసంచయము = డబ్బు సంపాదన. ఆగమోక్తులు = వేదవాక్యములు, విషయజయము = ఇంద్రియజయము; 112. జాతవేదసుఁడు = అగ్ని. జామాత = అల్లుఁడు, జాయ = భార్య, జలాశయము = సముద్రము; 113. చరణము = పాదము, కరణము = యుద్ధసాధనము; 114. ఉష్ట్రము = ఒంటె;

115. గుహ్యాభాషణము = రహస్య సంభాషణము; 116. సతము = ఎల్లప్పుడు, లాఘవము = చులకన, పరిభవము = అమర్యాద, మలయగిరి = మలయపర్వతము, బిల్లమహిళ = కోయపడతి, ఇంధనము = కట్టెలు; 119. మినమితుఁడు = నముచిఁడు, వెక్కుచుండు = గర్వపడు.

## చతుర్థ శతకమందలి కఠినశబ్దములకు అర్థములు.

123. కులట = జారిణి, సాధ్వి = పతివ్రత, ఒజ్జ = గురువు; 124. స్వార్థపరులు = స్వలాభమును కోరువారు; 125. సంసృతి = సంసారము; 127. మహిళ = స్త్రీ; 130. అవనిసురుఁడు = బ్రాహ్మణుఁడు; 131. నిధనము = మరణము; 132. నిమ్నభూతలము = పల్లపునేల, నాగము = పాము, లాంగ = కన్నము; 133 ముద్దుటాలి = ప్రియురాలు; 134. మహిత పైతృకము = గొప్ప శ్రాద్ధము, పొలయలుక = ప్రణయకలహము, ఆదిఘనత = మొదటనుండు గొప్పతనము; భూరుహము = వృక్షము; 136. శుని = కుక్క, వామపక్షవర్తి = ప్రభుత్వమునకు విరుద్ధముగానుండు తెగవాడు, పదవి = ఉద్యోగము; 137. మలము = మురికి. కంటకము = ముల్లు; 139. ఐక్యము = ఐకమత్యము; 140 ఉత్తమాంగము = శిరస్సు, చర్మకారుఁడు = చెప్పులు కుట్టువాడు; 144. ఆప్తవాక్యము = మిత్రవచనము, ఆగమము = వేదము, మూలము = మూలకారణము; 148. అంతశ్శత్రువులు = కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు; విశ్వజేత = ప్రపంచమును జయించినవాఁడు; 150. హేయము = అసహ్యము, ఇంద్రియలోలుఁడు = విషయవాసనలు కలవాఁడు; 153. స్వీయవిత్తము = స్వంతధనము; 157. పరభృతాదులు = కోకిల మొదలగునవి, పంచమాదులు = పంచమాది స్వరములు, శారికాశుకములు = గోరువంకలు చిలుకలు, సరసగీతిక = మధురగానము; 158 సిద్ధసూక్తి = అనుభవసిద్ధమైన వచనము; 159. క్షుధ = ఆకలి, క్షోభ = కష్టము; 162 సహచరము = వెనువెంట తిరుగునది, ఉష్ణశీతయుగము = శీతోష్ణములజంట; 165. సుధ = అమృతము, సుద్ద; 166, గండతలము = చెక్కిలి; 167 అమరతరువు = కల్పవృక్షము, భూరులు = కనుబొమ్మలు; 169. విధిగ = నియమప్రకారముగ, విధియుతము = శాస్త్రసమ్మతము, విధిగ = తప్పక, విబుధలోకము = స్వర్గలోకము; 170. కాళి = కాళికాదేవి; 175. దహరగగనవాసి = దహరాకాశమున నుండునది, వైఖరీనినదము = జీవులు మాటలాడు శబ్దములు; 176. శాబ్దబోధ = శబ్దార్థమును గ్రహించుట, అంబుమాన సమము = ఉదకప్రమాణముతో సమమైనది, ఉర్వీగుణానుగము = భూమిసారమును పొందునది?

178. సప్తపది = వివాహకాలమున సప్తపదిని త్రొక్కించుట; 180. దేశికుఁడు = గురువు. అద్వైతశాస్త్రజలధి = వేదాంతశాస్త్రమను సముద్రము; స్వీయానుభూతి = ఆత్మానుభవము; 185. అహమహమిక = నేనుముందు అను తొందర. గ్రిధనచేయు = నిర్మించు; 187. త్రిపద = గాయత్రీమంత్రము; 188. ఆశాంబరుఁడు = దిగంబరుఁడు. పితృవనము = శ్మశానము; 189. గగనమగుట = శూన్యమగుట; 190. వన్యభూమి = అడవినేల; 194. గౌణము = అప్రధానమైనది; 195 మనువు = మంత్రము; 197. శకటబదర సంబంధము = బండి, రేగుచెట్టు అనెడి సంబంధము; 198. ఆహ్వ = నామము. అంబుజనేత్రుఁడు = పద్మనయనుఁడు; 200. ఈషణములు = దారాపుత్రధనాదులయందలి ప్రేమ; 202. భూతపతి = పిశాచము; 203 ద్యూతము = జూదము. మదిర = కల్లు. మృగయ = వేఁట; 204. తరుమూలము = చెట్టువేరు. రుజ = రోగము. ఎసగునో కసుగునో = హెచ్చునో తగ్గునో; 206. ఉర్వరావనికృషి = సారవంతమైనభూమిని సేద్యముచేయుట; 207. పాదుకలు = చెప్పులు; 208 వర్ణము = రంగు. జాతి భూష = అలంకారము. స్వర్ణహారి = కంసాలి. వర్ణహీన = జాతిరహితము; 209. భిదురాయుధము = వజ్రాయుధము. వాగ్విభూతి = మాటనేర్పు. వక్త = మాటలాడువాఁడు. జనవిడంబనము = లోకులకు డాంబికముగా చూపబడునది; 210. ఎబ్బెరాసి = ఏబ్రాసి; 212. పిపీలిక = చీమ. తనుబలి = ఆత్మబలిదానము; 213. నరపతిసుత = రాజకుమార్తె. సురతము = సంభోగము; 217. గుప్త = రహస్యము; 219. గురుత = గొప్పతనము. లఘుత = చులకతనము; 223. బ్రహ్మజాతి యసుర = బ్రహ్మరాక్షసి; 226. కల్పబీజము = కల్పవృక్షము యొక్క విత్తనము; 229. తూలరాశి = పత్తికంట్లము. అగ్నికీల = వహ్నిజ్వాల; 230. ఉమానామకీర్తనము = లలితానామ పారాయణము; 232. నాకసుఖము = స్వర్గసౌఖ్యము. అశనము = అన్నము; 233. పాపచయము = పాపసమూహము; 237. పంచపర్వములు = కృష్ణాష్టమి, చతుర్దశి, అమావాస్య, పౌర్ణిమ మొదలగునవి; 240. చరమజన్మ = అంతిమజన్మము; 241. అజ్ఞత = అజ్ఞానము; 242. తనులు = శరీరములు. హృదయసంగమము = మనస్సులు కలియుట; 244. కోశము = గ్రంథము. గురునిముద్ర = గురూపదేశము; 247. అలసత = సోమరితనము; 249. కాచలబ్ధి = గాజుముక్క లభించుట.

---

ప్రాపంచిక పారమార్థికములకు సాధనము !
జీవితమందలి గడ్డుసమస్యల పరిష్కరించు ఏకైకమార్గము !!
భారతీయులనేకాక విదేశీయులను సైతము ఆకర్షించజాలిన ఏకైక ఉద్గ్రంథము !!!

# శ్రీమద్భగవద్గీత

1. ప్రతిశ్లోక తాత్పర్యము, ప్రతి అధ్యాయ మాహాత్మ్య సారాంశములు.
అధ్యాయమున కొక చిత్రపటము, దృఢమైన క్యాలికోబైండు.
ముద్దులొలుకు పంచరంగుల ముఖచిత్రముగల కవర్ జాకెటు.
600 పేజీలు 5″×3″ సైజు
ధర రూ. 1–25 న. పై. (పోష్టుఖర్చుతో రూ 2-12 న. పై.)

2. మూలము, పేజీకొక శ్లోకముచొప్పున పారాయణమునకు
యోగ్యమగు పట్టుబట్ట బైండు
740 పేజీలు 3″×2″ సైజు
ధర రూ. 1 మాత్రమే. (పోష్టుఖర్చుతో రూ. 1–87 న. పై)

3. మూలము, పారాయణము చేయువారందరికి అందుబాటులో నుండుటకై
గీతా ప్రచారదృష్ట్యా ప్రచురింపబడినది.
ధర రూ. 0–19 న. పై. (పోష్టుఖర్చుతో రూ. 1–06 న. పై.

పై భగవద్గీతలను తెప్పించుకొన గోరువారు, పోష్టుఖర్చులతోసహా వానికగు మూల్యమును ముందుగా పంపిన, పుస్తకములు రిజిష్టరు పోష్టుద్వారా పంపబడును. వి. పి. ద్వారా పంపబడవు.



శ్రీరామా బుక్ డిపో, శికింద్రాబాద్.